

నమామ్యవేదమాతరమ్

# తైత్తిరీయోపనిషత్తు

## ఆంధ్ర వ్యాఖ్యాన సహితము

అంకితం

శ్రీ వేంకటేశ్వర స్వామివారి దివ్య పాదారవిందములకు


వ్యాఖ్యాత :

దశిక కృష్ణమోహన్, ఎం.ఎ.,

తెలుగుపండిట్

టేలర్ హైస్కూలు

నరసాపురం - 534 275

# తైత్తిరీయోపనిషత్తు
(ఆంధ్ర వ్యాఖ్యానము)

వ్యాఖ్యాత : దశిక కృష్ణమోహన్

ప్రథమ ముద్రణ : మార్చి 1995

కాపీలు : 1000



వెల - రు. 15/-





"This Book is published with the Financil assistance of Tirumala Tirupathi Devasthanam under their scheme Aid to publish Religious Books."





ప్రతులకు :
శ్రీమతి. పద్మిని.
ఇం. నం. 7-10-31
బళ్ళవారి వీధి,
పాతబజారు,
న ర సా పు ర ం.

ముద్రణ :
శ్రీ న వ జ్యో తి ప్రె స్,
శివాలయం వీధి,
నరసాపురం - 534 275.

# విషయానుక్రమణిక



6. - బ్రహ్మాస్తిత్వ ప్రతిపాదనము - సందేహము

7 - సందేహ నివారణము - బ్రహ్మాస్తిత్వ నిశ్చయము

8. - బ్రహ్మానంద వివరణము

9. - ఫలశ్రుతి

3) భృగువల్లి :

1. - భృగు తపస్సు

2. - అన్నము బ్రహ్మము

3. - ప్రాణము ,,

4. - మనస్సు ,,

5. - విజ్ఞానము ,,

6. - ఆనందము ,,

7. - ప్రాణమే అన్నము } అన్నము యొక్క మహాత్త్వము

8. - జలమే ,,

9. - పృథివియే ,,

10. - అన్నారాధనము – అతిథి సేవనము

పరమేశ్వర విభూతి

బ్రహ్మోపాసనాఫలము

బ్రహ్మప్రాప్తి విధము – ఫలము

బ్రహ్మత్వ సిద్ధి.

# ముందుమాట

భారతదేశము కర్మభూమి. ఆర్ష సంప్రదాయమును నెమ్మన మ్మునకు సంతరించుకొన్న పుణ్యభూమి. తరతములనాటి వేదవిద్యను పురాణేతిహాసాదులను కన్నతల్లియై పోషించుచున్న ప్రౌఢ. ఐతిహాసికముగ, చారిత్రకముగ తనకీర్తిని దిగంతముల వ్యాపింపఁ జేసికొని, పురాణ పురుషులకు, ఋషిపుంగవులకు, కారణజన్ములకు కాణాచియై వెలుఁగొందుచున్న దివ్యతేజః పుంజము. వనజ గర్భుని చతుర్ముఖంబులు నాఁబఱగిన చతుర్వేదములను, తదంగములను చతుర్దిశలకు విస్తరింపజేసిన పుణ్యక్షేత్రము.

అట్టి యీ సువిశాల భారతదేశము యొక్క బహుముఖ సాధన, సభ్యత అనునవి మహర్షి చేతనా లబ్ధమగు తత్త్వానుభూతిపై ప్రతిష్ఠిత ములై యున్నవి. భారతీయ సాహిత్యము, శిల్పము, విజ్ఞానము, దర్శనము, కులమత సమాజములు,వాని ధర్మములు, అర్థవ్యవహా రాది నీతులు మొదలగు సమస్త విషయములయొక్క నిర్మాణము ఉపనిషద్జ్ఞానమును పరమాదర్శముగ పెట్టుకొని జరిగినదే అనుట యథార్థము. కనుక నుపనిషత్తులే భారతీయ సంస్కృతికి ప్రాణ స్వరూపములు. అందుచేతనే భారతీయ సంస్కృతి ఆర్యసంస్కృతిగ చెప్పఁబడుచున్నది.

ఆర్యసంస్కృతికి మూలములయిన వేదములు అపౌరుషే యములని, జ్ఞానప్రతిపాదకములని అస్మర్యమాణ కర్తృకములని కీర్తింపఁబడుచున్నవి. వేదశబ్దమునకు అర్థము జ్ఞానము. "విదజ్ఞానే" అని. వేదముయొక్క జ్ఞానకాండమే ఉపనిషత్తు. "ఉప-ని-షద్" అను దానికి వ్యవధాన రహితమైన, సంపూర్ణమైన జ్ఞానము అనునది అవయ వార్థము. 'ఉప-ని' అను నుపసర్గలతో కూడిన 'సద్' ధాతువుయొక్క క్విబంతరూపమే 'ఉపనిషత్తు' అని దార్శనిక విద్వాంసుల కథనము.

'సద్' ధాతువునకు వినాశము-జ్ఞానము మఱియు ప్రాప్తి అను మూడ ర్థములు కలవు. ఈ యర్థముల ననుసరించివారు "ఉపనిషాదయతి సర్వానర్థకం సంసారం వినాశయతి, సంసారకారణ భూతామ విద్యాంచ శిథిలయతి, బ్రహ్మచగమయతీత్యుపనిషత్" అని విశదీకరించియున్నారు. 'షద్ల్ విశరణ గత్యవసాదనేషు' అని సిద్ధాన్తకౌముది. అనగా 'షద్' అనుధాతువు విశరణము (అవిద్యానాశనము) గతి (బ్రహ్మప్రాప్తి) అవసాదనము (గర్భనరకనివృత్తి) అను అను నర్థములలోనుపయోగింపఁబడునని అర్థము. అట్టి ఉపనిషత్తును బోధించునది మోక్షకారకమగు నధ్యాత్మవిద్య లేక బ్రహ్మవిద్య. వేదముయొక్క అంతిమ భాగమగుట చేతను; వేదసిద్ధాన్తతాత్పర్యాదులనువర్ణించుట చేతను,ఉపనిషత్తును వేదాన్తమని కూడనుడువుదురు.

నాల్గువేదములయొక్క ప్రతియొక్క శాఖకు సంబంధించి యొక్కొక్క ఉపనిషత్తు గలదు. వేదశాఖలనంతములు కావున ఉపనిషత్తులు ననంతములైయున్నవి. నేటికాలమున ననేక వేదశాఖలు లుప్తములైనవి: వానితోపాటు వానికి సంబంధించిన అనేక ఉపనిషత్తులు కూడ కనుమఱుఁగైనవి. ప్రస్తుతము ఉన్నవానిలో -'శ్లో॥' "ఈశకేనకఠ ప్రశ్నముండ మాండూక్య తిత్తిరిః। ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం-దశ॥" అనునీపది యుపనిషత్తులును గంభీరతరమయిన యర్థమును ప్రతిపాదించు చున్నవి. అందువలననే ఆచార్య పుంగవులు బ్రహ్మవిద్యకు నీపదింటిని ప్రమాణ భూతములుగ స్వీకరించి యున్నారు. వీనిలో మాండూక్యోపనిషత్తు చాల చిన్నది. బృహదారణ్యకోపనిషత్తు మిక్కిలి పెద్దది. అన్నియును అధ్యాత్మతత్త్వ బోధకములు. అధ్యాత్మతత్త్వమును బోధించు కారణముననే ఉపనిషత్తులు సమస్త శాస్త్రములకంటె నున్నతపీఠము నలంకరించినవి. ఇందు ప్రతిపాదింపఁబడిన జ్ఞానమే సర్వోత్కృష్టమయినది. ఈ ఉపనిషత్తులయొక్క అర్థనిర్ణయము కొఱకే వ్యాసమహర్షి

బ్రహ్మ సూత్రములను వ్రాసియున్నాఁడు. శంకర భగవత్పాదులు ఉపనిత్తులకు భాష్యము వ్రాసియున్నారు. ఉపనిషత్తుల యొక్క సారభూతమయిన అర్థమునే కృష్ణపరమాత్ముఁడు పాండవ మధ్యమునకు గీతోపదేశము గావించినాడు. "సర్వోప నిషదోగావో,దోగ్ధా గోపాలనందనః" ఉపనిషత్తుల యొక్క అర్థము సర్వజన సుగమము చేయుటకే పురాణేతి హాసాదులు ప్రకటింపఁబడినవి. "ఉపనిషత్తు-బ్రహ్మసూత్రములు-భగవద్గీత" ఇది వేదాన్త దర్శనమునకు ప్రస్థాన త్రయము. ఇందుగీత పఠనాత్మకము, బ్రహ్మసూత్రము మననాత్మకము. ఉపనిషత్తు శ్రవణాత్మకము.

"ఉపనిషత్తుల యందలి ముఖ్యవిషయము పరమాత్మ తత్త్వము సత్యజ్ఞానానంద స్వరూపుఁడగు పరమేశ్వరుఁడొకఁడు కలఁడనియు, అతని చిద్విలాసమే యీ సకల చరాచర ప్రపంచమనియు, అతడే పరమాత్మ బ్రహ్మాది శబ్దవాచ్యుఁడనియు, జీవాత్మ పరమాత్మ ప్రతిబింబమే అనియు, దృశ్యమయిన సకల జగత్తు నశించునదేననియు, అదృశ్యమై సర్వవ్యాపకమై యున్న పరబ్రహ్మ మొకటియే, సత్యమనియు వీని ముఖ్యమతము. జగత్తును మాయయందు ప్రతిఫలించిన పరమేశ్వరుని ప్రతిబింబమే జీవుఁడు. అవిద్యానుగ్నుఁడయిన ఈ జీవుఁడు పూర్వపూర్వకృత పుణ్యపాప ఫలమును ఉత్తరోత్తర జన్మములందనుభవించుచు, జనన మరణ ప్రవాహ రూపమైన సంసారమునమునిఁగి తేలుచుండును. దానికి కారణమవిద్య. అవిద్యానాశకము జ్ఞానము. అదియే ఆత్మజ్ఞానము, జీవుఁడాత్మ జ్ఞానమున సమస్త బంధముల నెడఁబాసి ముక్తుఁడగును. అదియే జీవన్ముక్తి. సంసార బంధం నుండి విడివడుటయే ముక్తి. ముక్తునకుఁబునరా వృత్తి లేదు. కావున జీవునకాత్మ జ్ఞానమావశ్యకము" అట్టి దానిని ప్రసాదించు నదియే ఉపనిషత్తు." అని "సంస్కృత సాహిత్య చరిత్ర - వైదిక వాఙ్మయము" - శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి.

ఇట్లుపనిషత్తు ఆధ్యాత్మ విద్యారహస్య ప్రతిపాదకమై, జ్ఞాన విద్యకు నక్షయ్యమగు భాండారమగు చున్నది. పరమ పురుషార్థమును ప్రకాశింపఁజేసి పరమార్థమును ప్రదర్శింపఁజేయు నుత్కృష్ట సాధన మగుచున్నది. ఈ ఉపనిషత్తుల సంఖ్య 108 గా చెప్పఁబడు చున్నది. (మఱికొన్ని కూడ కలవు.) ఇందు కొన్ని గద్యాత్మకములు. కొన్ని పద్యాత్మకములు. కొన్ని గద్య పద్యోభయ మయములు. మహర్షులు ఏ ఆధ్యాత్మికతత్వములను జ్ఞానదృష్టితో సాక్షాత్కరింపజేసి కొనిరో వాని నన్నింఁటిని ఆయా ఉపనిషత్తులయందు వర్ణించిరి. ఉపనిషత్తు సద్గురువువద్ద నుండి మాత్రమే పొందఁదగి యున్నది. "సర్వంఖల్విదం బ్రహ్మ, తత్త్వమసి, బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి జీవో. బ్రహ్మైవ నా పరః" అనునది ఉపనిషత్తులయొక్కతత్త్వ జ్ఞానోపదేశ సారాంశము ఇట్టి బ్రహ్మ జ్ఞానమును తెలిసికొన్నవారికి ప్రపంచమున తెలిసికొన వలసిన దేమియును లేదు.

"ఏతద్జ్ఞేయం నిత్యమేవాత్మ సంస్థం,
నాతఃపరం వేదితవ్యం హి కించిత్" - శ్వేతాశ్వతరోపనిషత్తు.

"ఏకస్మిన్ విజ్ఞాతే, సర్వమిదం విజ్ఞాతం భవతి"-ఛాందోగ్యోపనిషత్తు.

ఇట్లు,
వ్యాఖ్యాత-
దశిక కృష్ణమోహన్; ఎం. ఎ.,
ఆంధ్రోపాధ్యాయుఁడు,
ఉన్నత పాఠశాల.

నరసాపురం.
24-12-88

# 3. పరిచయము

చతుర్వేదములలో నొకటియగు యజుర్వేదము-కృష్ణ యజుర్వేదము, శుక్ల యజుర్వేదము అని 2 విధములుగ నున్నది.

"వ్యాసుడు ప్రవచించిన వేదమును వైశంపాయనుడు తన శిష్యుడగు యాజ్ఞవల్క్య మహర్షికి ప్రవచనము చేసెను. కొంత కాలము పిదప తనమాట కెదురు చెప్పుటచే వైశంపాయనుడు క్రుద్ధుడై తనవద్ద నభ్యసించిన వేదవిద్య నంతటిని వెంటనే తనకిచ్చి వేయుమని యాజ్ఞవల్క్యు నాదేశించెను. అతడును గుర్వాజ్ఞాను సారము వెంటనే వైశంపాయనుని వద్ద నేర్చుకొనిన వేదవిద్య నంతను వమన రూపమున బయటపెట్టెను. వైశంపాయనుని శిష్యులు కొందఱు తిత్తిరి పక్షులైవచ్చి ఆ వమన రూపమున నున్న వేదవిద్యను గ్రహించిరి. అదియే కృష్ణయజుర్వేదము. వైశంపాయనుని క్రోధమునకు గురియై అధీతవేదవిద్యను విసర్జించిన యాజ్ఞవల్క్యుడు తిరిగి వేదము నభ్యసింపగోరి, సూర్యదేవు నారాధించెను. సూర్యుడు సంతోషముతో నాతనికి వేదమును ప్రవచించెను. అది శుక్లయజుర్వేదమైనది." - అని పౌరాణిక కథనము.

కృష్ణయజుర్వేదమునందు 1) తైత్తిరీయ సంహిత 2) మైత్రాయణీ సంహిత 3) కఠక సంహిత 4) కాఠకాపిష్ఠల సంహిత అను నాలుగు శాఖలు కలవు వీనిలో తైత్తిరీయ శాఖ ప్రధానమైనది.

వేదములు-"బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు-" అని 3 ప్రధాన భాగములుగ నుండును. కృష్ణయజుర్వేదమున తైత్తిరీయారణ్యము, తైత్తిరీయ బ్రాహ్మణమును కలవు. అందు తైత్తిరీయారణ్యకము నందలి 10 అధ్యాయములలో 7,8,9 అధ్యాయములు మూడును కలసి "తైత్తిరీయోపనిషత్తు" గా వ్యవహరింపబడు చున్నది. ఇది (1) శిక్షావల్లి (2) బ్రహ్మానందవల్లి (3) భృగువల్లి అను వల్లీత్రయముతో నొప్పు చున్నది.

# 4. సారాంశము

## 1. శిక్షావల్లి

ఈ ప్రకరణమున నీయఁబడిన శిక్షాను రూపముగ నూతన జీవనమును సరిదిద్దుకొను మానవుఁడు ఇహపరలోకముల రెంటికి సంబంధించిన సర్వోత్తమ ఫలమును పొందగలఁడు. బ్రహ్మ విద్యను గ్రహించుట యందును సమర్థుఁడగును అను విషయమును తెల్పు నది కనుకనే ఇది "శిక్షావల్లి" యని వ్యవహరింపఁబడుచున్నది.

ఆధిభౌతిక ఆధ్యాత్మిక ఆధిదైవికములను త్రివిధవిఘ్న నివారణమునకై మొదట శాన్తిపాఠము శిష్యునిచే ప్రవచింపఁబడినది. పిమ్మట ఈ వల్లికి మూలమగు 'శిక్ష' వివరింపఁబడుచున్నది. పరమాత్మ రహస్య విద్యా జిజ్ఞాసువులయిన శిష్యులు ముందుగ వేదోచ్చారణ నియమములను, సంకేతములను తెలిసికొనవలెను. వర్ణోచ్చారణమునను, నిమ్నోచ్చాదిస్వరోచ్చారణమునను మిక్కిలి ధ్యానమవసరము. బాహ్యాభ్యంతర భేదములను స్పష్టముగ నెఱింగి పఠింపవలెను. ఈవిధమున వర్ణోచ్చారణమున స్వరము, మాత్ర, ప్రయత్నము, సామగానరీతి, సంధి, ప్రకృతి భావము అను 6 నియమముల పాలనము మిక్కిలి అవశ్యకము.

"దుష్టశ్శబ్దః స్వరతో వర్ణతో వా, మిథ్యా ప్రయుక్తోన తదర్థమాహ।
సవాగ్వజ్రో యజమానం హినస్తి, యథేంద్రశత్రుః స్వరతోఽ
పరాధాత్॥

అని పతంజలి మహర్షి కూడ మహాభాష్యమున స్పష్టీకరించియున్నాఁడు.

పిమ్మట సంహితారహస్యము వర్ణింపఁబడినది. అధిలోక, అధిజ్యౌతిష, అధ్యాత్మ, అధివిద్య, అధిప్రజా సంహితలైదును కలసినది "మహాసంహిత" అని చెప్పఁబడుచున్నది. వీనికి క్రమముగ పూర్వరూప - ఉత్తర రూప - సంధి - సంధానములు వివరింపఁబడినవి. ఈ సంహితా జ్ఞానమున క్రమముగ స్వర్గాద్యుత్తమ లోకప్రాప్తి, నానావిధ భోగ్యపదార లాభము, వాక్ఛక్తి, విద్య, బ్రహ్మ తేజస్సు, సంతానము అను ఫలములు లభించుచున్నవి.

అనంతరము బ్రహ్మప్రాప్తి కవసరమగు శారీరక మానసిక బలములను పొందుటకు పరమేశ్వరుని ప్రార్థించు విధానము చెప్పఁబడినది. ఓంకారము సర్వశ్రేష్ఠము, తదుచ్చారణము సర్వ వేదోచ్చారణ ఫలహేతువు. గురువు శిష్యహితార్థము తన లౌకిక పార లౌకిక హితార్థము హవనము చేయువిధానము బోధింపఁబడినది.

వ్యాహృతి చతుష్టయ వర్ణనము శిక్షావల్లిలో విశిష్ట స్థానము నాక్రమించింది. ఈవ్యాహృతుల ద్వారమున పరమేశ్వరోపాసన సుస్పష్టమగును. భూః భువః సువః మహస్ అను నాలుగు వ్యాహృతులలో మహోవ్యాహృతి బ్రహ్మము. అది లోకములలో ఆదిత్యరూపమై, జ్యోతులలో చంద్రుఁడై, వేదములలో సర్వవేదమయమై, ప్రాణులలో నన్నమై ప్రకాశించుచున్నది. తక్కిన మూడు వ్యాహృతులకునిదియే ఆత్మ. దానివలననే సర్వవేదములు మహిమాన్వితములగు చున్నవి. సమస్త లోకములు ప్రకాశించుచున్నవి. ఈ వ్యాహృతులు నాలుగు ఒక్కొక్కటి మఱల నాలుగు విధములగుచున్నవి. దీనిని పరిపూర్ణముగ నెవఁడు తెలిసికొనుచున్నాఁడో అతఁడు బ్రహ్మమునుగూర్చి తెలిసికొన్న వాఁడగును, అట్టి బ్రహ్మవేత్తను సమస్త దేవతలు గౌరవింతురు.

పిమ్మట బ్రహ్మస్థానము, ప్రాప్తిమార్గము వివరింపబడినవి. శీర్ష కపాలమును భేదించి వచ్చు సుషుమ్నానాడీసానమే బ్రహ్మ ప్రాప్తిమార్గము. బ్రహ్మవేత్త బ్రహ్మలోకమునకు పోవుటకుముందు అగ్నిని అనంతరము వాయువును, అటు నుండి సూర్యుని, పిమ్మట బ్రహ్మమును చేరుకొనును. అట్టివాఁడు స్వారాజ్యమును పొందును. తన మనసుపై అధిపత్యమును కలిగియుండును.

అనంతరము బోధింపఁబడినది పాఙ్క్తషట్కము. లోక, జ్యోతి, స్థూలపదార్థ, వాయు-అనునవి అధిభౌతిక పాఙ్క్తములు. కరణధాతు పాఙ్క్తములు ఆధ్యాత్మికములు. సాధకుఁడాధ్యాత్మిక పాఙ్క్తము నుండియే బాహ్యపాఙ్క్తమును, బాహ్యపాఙ్క్తము నుండియే ఆధ్యాత్మిక పాఙ్క్తమును పూరించుచున్నాఁడు ఈపాఙ్క్తమును, అందలి ప్రత్యేక స్థూల సూక్ష్మ తత్త్వమును బాగుగ తెలిసికొన్న మానవుఁడ న్నివిధముల ఉన్నతిని పొందఁగలఁడు.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" (గీత) "ఓమితి బ్రహ్మ" "ఓమితీ దగ్ం సర్వం" - ఈరీతిగ పరమేశ్వర నామమగు ఓంకారమునెడ మానవునకు శ్రద్ధ ఆసక్తి కలిగించుటకు ఓంకారముయొక్క మహిమ వర్ణింపఁబడినది. ఓంకారము పరమేశ్వరనామమగుటచే అది సాక్షాత్తు బ్రహ్మమే. రాథీతరుఁడు సత్యమును, పౌరుశిష్టి తపస్సును, మౌద్గల్యుడు స్వాధ్యాయ ప్రవచనములను ప్రధానములని చెప్పిరి. సాధకునకు ఈమూడిటి యొక్క ప్రాధాన్యము నవసరమే. అతనికి అధ్యయనాధ్యాపనములతో పాటు సదాచార పాలనము (ఋతమ్) తపోదమశమాదులు. అగ్నిహోత్ర ప్రజన నాదికములు అవశ్యాచరణీయములు. ఈ సందర్భమున త్రిశంకు మహర్షియు తన యనుభవమును వివరించెను. ప్రతి మానవునకు సత్సంకల్పము, తత్సాధనకై పూర్ణ సావధానతయు నుండవలెనని వైదిక ప్రవచనము.

ఈ విధముగ శిష్యుఁడు గురువు వద్ద స్వరోచ్చారణము, సంహితారహస్యములు, వ్యాహృతి చతుష్టయము, పాఙ్క్తషట్కము, ఓంకార వైశిష్ట్యము, మున్నగు విషయములందు శిక్షణ పొందిన యనంతరము, గృహస్థాశ్రమ ధర్మములను పాటింపవలసిన పద్ధతిని గురువు బోధించును. అతఁడు సత్యము, ధర్మము, స్వాధ్యాయ ప్రవచనము, దేవ పితృకార్యములు మున్నగు వానియెడల ప్రమాదపడక యథోక్తముగ పాటింపవలెను. ఇట్లు గురువు శిష్యున కిట్టి శిక్షణ నొసంగుటచే నిది శిక్షావల్లియైనది.

# 2. బ్రహ్మానందవల్లి

శిక్షావల్లియందు కర్మవిరుద్ధములగు సంహితాది విషయములు, కర్మసముచితములగు నుపాసనలు వివరింపఁబడినవి. అనంతరము వ్యాహృతి రూపమున సోపాధిక ఆత్మదర్శనము బోధింపఁబడినది. ఇంతమాత్రముచేత సంసారబీజమశేష నాశనము పొందనేరదు. అజ్ఞానము సంసారబీజ కారణము. ఇట్టి యజ్ఞానమును పోగొట్టు మార్గమన్వేషింపవలెను. సంసార బీజమగు నీయజ్ఞానము బ్రహ్మజ్ఞానము చేతనే తొలఁగిపోవును. కావున నిట్టి యజ్ఞానమును పోగొట్టి బ్రహ్మజ్ఞానోపదేశము చేయుటకై బ్రహ్మానందవల్లి ప్రారంభింపఁబడుచున్నది. ఇందు మోక్షమునకు సాక్షాత్సాధన భూతమగు బ్రహ్మవిద్య ప్రతిపాదింపఁబడుచున్నది.

బ్రహ్మ విదుఁడుత్కృష్ట పదవిని పొందును. బ్రహ్మమును తెలిసికొనుటకు దాని లక్షణము చెప్పఁబడినది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని. ఇట సత్యము, జ్ఞానము, అనంతము అనుమూడు

పదములు విశేషణములు. బ్రహ్మపదము విశేష్యము. సత్యాది శబ్దములచే పరోక్షముగ నుపలక్షితమయిన పరబ్రహ్మము శ్రేష్ఠమగు హార్దాకాశమందును ఉపలబ్ధమగును. అట్టిది బుద్ధియను గుహాయందు నిగూఢమై యున్నది. అట్టిదానిని తెలిసినవాఁడే బ్రహ్మవిదుఁడు. అతఁడు సమస్త వాంఛితములను పొందఁగలఁడు. బ్రహ్మజ్ఞాని బ్రహ్మస్వరూపుడే అగుచున్నాఁడు. బ్రహ్మమే బుద్ధిగుహాయందు అపరోక్షముగ నాత్మ స్వరూపమున సుగ్రాహ్యమగుచున్నది. అట్టి బ్రహ్మము యొక్క ఆత్మ నుండి ఆకాశము, దాని నుండి వాయువు, దాని నుండి అగ్ని, దానినుండి నీరు, దానినుండి పృథివి, దానినుండి ఓషధులు, వాని నుండి యన్నము, దాని నుండి పురుషుఁడు నుద్భవించెను. అన్న రసమువలన పుట్టినట్టియు, జ్ఞానోపదేశమునకై శ్రుత్యనుగృహీతుఁడై నట్టియు నగు నీ పురుషుఁడన్నరసమయుఁడు. సర్వభూతములలో నన్నము శ్రేష్ఠము మఱియు జ్యేష్ఠము. దానిని బ్రహ్మముగ నుపాసించువారు సమస్తాన్నములను పొందుదురు. అది ప్రాణులచే భక్షింపఁబడుచున్నది. అదియే ప్రాణులను భక్షించుచున్నది. కనుకనే అదియన్నము. అన్నరసమయాత్మకంటెభిన్నము సూక్ష్మతరమైనది ప్రాణమయకోశము. ఇట్లే క్రమముగ మనోమయ, విజ్ఞానమయ ఆనందమయాత్మలొకదానికంటె నొకటి భిన్నములు, సూక్ష్మములు. వానిని వివరించు సందర్భములందే అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము అనునైదింటి యొక్క ఉత్కృష్టత వివరింపఁబడినది. అంతిమమగు నీయానందమే పరబ్రహ్మము. అదియే ప్రస్తుతవల్లి యందు సత్యాదిశబ్దములచే నుపలక్షితమగుచున్నది. దాని నుపదేశించుటకే పంచకోశములు ఒకదాని తరువాత నొకటి బోధింపఁబడుచున్నవి. కావున మానవుని యొక్క హృదయాకాశమున బ్రహ్మము ఆనందమయుఁడై యున్నట్లు తెలియు

బ్రహ్మము ఉండెనా? లేదా? అను విషయమును తర్కించి, అట్టి యానందమయుఁడగు బ్రహ్మమును తెలిసికొనినవాఁడు సత్పురుషుఁడగుచున్నాడు. బ్రహ్మ జ్ఞానము లేనివాడుకూడ నా బ్రహ్మమును పొందునా? పొందడా? అను శంకయునిట నివారింపఁబడును. బ్రహ్మాస్తిత్వము వివరింపఁబడును.

బ్రహ్మము తాననేకములు గావలెనని తపస్సుచేసి, దృష్టిగోచరమగు నీసమస్తజగత్తును సృష్టించెను. పిమ్మట తానందే ప్రవేశించి, మూర్తము - అమూర్తము నయ్యెను. కావున బ్రహ్మవేత్తలు మూర్తామూర్తాదిక మంతయు బ్రహ్మమే యని పల్కుదురు. సృష్టికి ముందీ ప్రపంచమంతయు నామ రూప విశేషములు లేని బ్రహ్మమే. దానినుండి బ్రహ్మము నామరూపకాత్మకమగు ప్రపంచముగ తననుతాను చేసికొనెను. అట్టిసుకృతమగు బ్రహ్మమే రసస్వరూపము, ఈ ప్రాణిజాతమా రసమును పొందినచో ఆనందము కలదగును. ఈయానందమే హృదయాకాశమున లేనిచో, నెవఁడు జీవింపఁగలఁడు? జీవించుచున్నాఁడనిన శక్తియొకటి ఉండవలెను కదా! అట్టి శక్తి బ్రహ్మమే తక్క వేఱుగాదు. అది యన్నంగమైనను విజ్ఞానమయ కోశోపాధిచే దానికి ప్రాణనాది క్రియాకర్తృత్వము తటస్థించుచున్నది. కావున బ్రహ్మాస్తిత్వమంగీకరింపవలసియున్నది.

అట్టి బ్రహ్మమందు భయములేని స్థితిని పొందు సాధకుఁడు అభయంగతుఁడగును. బ్రహ్మము తనకంటె భిన్నము కాదని తెలిసికొనలేనివాఁడు విద్వాంసుఁడయినను, బ్రహ్మము తనికి భయకారణమగును. మహావీర్యవంతులు స్వతంత్రులునగు సూర్యాది దేవతలు కూడ బ్రహ్మమునుగూర్చి భేదంబు కలిగియుండుటచేతనే రాజునకు భృత్యులకైవడి బ్రహ్మమునకు వశవర్తులయి, స్వస్వకృత్యములననవహితచిత్తులై నిర్వహించుచున్నారు. కావున జగత్తునంతటిని

సక్రమముగ నడపెడి శక్తియొకటున్నదికదా! అదియే బ్రహ్మము. ఈ విధముగ కూడ బ్రహ్మాస్తిత్వము నిర్ధారింపఁబడుచున్నది.

అటువంటి బ్రహ్మ స్వరూపమగు నానందముయొక్క విచారణ మిపుడు చేయఁబడుచున్నది. లౌకికానందము బ్రహ్మప్రాప్తికి ద్వార భూతము. అందువలననే బ్రహ్మానంద ప్రకరణమున లౌకికానందము యొక్క వివిధ కక్ష్యలు ప్రస్తావింపఁబడుచున్నవి. మానుషానందము, మనుష్య గంధర్వానందము, ఆజానజ దేవానందము. కర్మదేవా నందము, దేవానందము, ఇంద్రానందము, బృహస్పతియానందము, ప్రజాపతియానందము, బ్రహ్మానందము. ఇట్లు వివిధానంద శ్రేణిలో పూర్వపూర్వానందముకంటె ఉత్తరోత్తరానందము నూరురెట్లధికమగు చున్నది. అకామహతత్త్వము సమగ్రమయినప్పుడే కేవల బ్రహ్మా నందానుభవము ప్రాప్తమగును. ఇతరానందములన్నియు గంభీర మగు బ్రహ్మానంద సముద్రము యొక్క బిందువులతో తుల్యములగు చున్నవని వివరించుటచే ఇతరానందములు నిందు తెలుపఁబడినవి.

పురుషుని యందానంద స్వరూపముగ నే బ్రహ్మ మున్నదో అదియు, సూర్యమండలము నందున్న పరబ్రహ్మము నొక్కటేయగు చున్నది. ఎవఁడీ విధముగ తెలిసికొనుచున్నాడో. అతఁడీ లోకము నుండి మరలి క్రమముగ అన్నమయాద్యాత్మలను పొంది తుదకీ ఆనందమయాత్మను పొందగల్గును. ఇట్టి బ్రహ్మానందము పంచకోశా తీతమైనట్లే మనోవాగగోచరము కూడ. మనోవాగతీతమయిన బ్రహ్మము యొక్క ఆనందమును తెలిసికొనినవాఁడు దేనివలనను భయపడడు. బ్రహ్మజ్ఞానికి సర్వము బ్రహ్మమే. కనుక శుభా శుభములు కూడ బ్రహ్మానన్యములే అగుచున్నవి.

ఈ విధముగ బ్రహ్మయొక్క ఉపలబ్ధి స్థానము, బ్రహ్మాత్మా నన్యత్వము, అనాత్మ భూతమగు కోశపంచకము నుండి ఆత్మను

వివేకించు మార్గము, వివిధోపపత్తి ప్రదర్శనములచే బ్రహ్మస్తత్త్వము ఈవల్లి యందు చక్కగా వివరింపఁబడినది. సర్వానందముల కంటె బ్రహ్మానంద ముత్కృష్టమని నిరూపింపఁబడినది. బ్రహ్మానందము నందినవానికి పుణ్యపాప నిమిత్తమగు సంతాపహేతువులేమింజేసి, జన్మాంతరము లేకుండుటచే మోక్షావాప్తి సంసిద్ధమని బ్రహ్మానంద వల్లి యందుపదేశింపఁబడినది. కాన, దీనికి బ్రహ్మానందవల్లి యను నామమన్వర్థమైనది.

# 3. భృగువల్లి

తైత్తిరీయోపనిషత్తు నందలి మూడవదియగు నీ భృగువల్లి యందు వరుణుఁడు తనపుత్రుఁడగు భృగుమహర్షికి గావించిన బ్రహ్మ విద్యోపదేశము వర్ణింపఁబడినది. కావుననే ఇది భృగువల్లియైనది.

భృగుమహర్షి వరుణుని యొక్క కుమారుఁడు. పరమాత్మను గూర్చి తెలిసికొనవలయునను దృఢ సంకల్పముతో నతఁడొకనాడు తన తండ్రియొద్దకుపోయెను. "నేను బ్రహ్మమునుగూర్చి తెలిసికొన వలెనను కొనుచున్నాను. కావున నాకు బ్రహ్మ తత్త్వము నుపదేశింపుము" అని ప్రార్థించెను. అంతట నతఁడు కుమారా! అన్నము, ప్రాణము, నేత్రము, మనస్సు, వాక్కు అనునవన్నియు బ్రహ్మోపలబ్ధికి మార్గములు మనకు ప్రత్యక్ష గోచరములగుచున్న వన్నియు ఎవరి నుండి యుత్పన్నములగుచున్నవో, ఎవని సాయమున మనుచున్నవో, అట్టి శక్తిని గూర్చి నీవు తెలిసికొనుము. అదియే బ్రహ్మము." అని బోధించెను. ఈవిధముగ తండ్రి యొక్క ఉపదేశమును పొంది. భృగుమహర్షి తపస్సు గావించెను. తపస్సు నందు

తండ్రి యొక్క ఉపదేశమును విచారించెను. కొంతకాలమునకతఁడు "అన్నము బ్రహ్మ" మని తెలిసికొనెను. ఎందుచేత? అన్నము నుండియే సమస్తభూతములు జనించుచున్నవి. జనించినవి అన్నము వలననే జీవించుచున్నవి. ఇహలోకమును వీడిపోవునపుడు ఈపృథివి యందు (పృథివీ వా అన్నమ్) వినష్టములగుచున్నవి. ఇట్లుతెలిసికొని భృగువు మరల తండ్రిని సమీపించి బ్రహ్మతత్త్వమును తెలుపు మనగా "తపస్సుచేత బ్రహ్మమును తెలిసికొనుము. తపస్సే బ్రహ్మ" మని తెలిపెను. భృగువు మరల తపస్సు చేసి ప్రాణము బ్రహ్మమని గ్రహించెను. అట్లే తండ్రి బోధించినవిధముగ మరల మరల తపస్సు చేసి క్రమముగ మనస్సు, విజ్ఞానము, ఆనందములను కూడ బ్రహ్మ ములని సృష్టి స్థితిలయాది విశేషపురస్సరముగ గ్రహించెను. ఇట్లు భృగువు యథార్థమైన పరిపూర్ణమైన బ్రహ్మ జ్ఞానమును పొందెను.

వరుణ బోధితమై, భృగు జ్ఞాతమైన ఈబ్రహ్మ విద్య విశుద్ధాకాశ స్వరూపమయిన పరబ్రహ్మమునందు ప్రతిష్ఠితమయినది. ఈ విష యము నెవఁడు తెలిసికొనునో, అతఁడు విశుద్ధాకాశ స్వరూపమయిన పరమానందమును పొందును. ఇంతేకాక, అతఁడు గొప్ప అన్నవం తుఁడును, గొప్ప భోగ సంపన్నుఁడును, పుత్ర పౌత్ర సంతాన వంతుఁడును, బ్రహ్మతేజస్సంపన్నుఁడును, కీర్తిమంతుఁడునై సర్వ శ్రేష్ఠుఁడుగ పరిగణింపఁబడును.

అట్లయిన, బ్రహ్మజ్ఞాని మాత్రమే పైన పేర్కొనిన సమస్త సంపదలను పొందునా? ఇతరులకవి లభింపవా? లభించుననిన యెట్లు? అనునది విచారింపఁబడుచున్నది.

అన్నము వలనను లభించునని గ్రహింపవచ్చును. అందుచేత అన్నమునునిందింపరాదు. ప్రాణమే అన్నము. శరీరము అన్నమును

భుజించుచున్నది. శరీరము నందు ప్రాణము ప్రతిష్ఠింపఁ బడినది. ఇట్లు అన్నము యొక్క మహిమను తెలిసికొనినవాఁడు పైన పేర్కొనిన సమస్త సంపదలను పొంది మహిమాన్వితుఁడగును. అన్నము నవహేళన చేయరాదు. దాని నభివృద్ధి చేయవలెను. అట్లే తన యింటికే తెంచిన ఏ అతిథికైనను ప్రతికూల సమాధానము నీయరాదు. ఆదరభావముతో నతిథి సత్కారము చేయవలెను. నికృష్ట భావముతో, మర్యాదా రహితముగ నతిథిని చూచినచో అట్టి ఫలమే తనకును లభించును. దీనిని గ్రహించి ఏమానవుఁడు విశుద్ధభావముతో నతిథి సత్కారము చేయునో అతఁడు సర్వోత్తమ ఫలము నందఁగలఁడు.

అట్లే బ్రహ్మమును సమస్తాధార భూతుఁడని ఉపాసించినచో, సాధకుఁడు ప్రతిష్ఠావంతుడగును. అతిథిని గౌరవించి, బ్రహ్మమును సర్వశ్రేష్ఠుఁడని యుపాసించినచో, సర్వోత్తముఁడగును. నశింపఁజే యుటకు నియమింపఁబడిన వానినిగ నుపాసించినచో ద్వేషించుచున్న శత్రువులను నశింపజేయును. అంతటను నిండియున్న బ్రహ్మ మొక్కఁడే అని తెలియక అజ్ఞానవశుఁడై విభిన్న దేవతల నుపాసించు వాఁడు వాస్తవిక లాభముచే వంచితుఁడగును. అంతటను ఒకే పరమాత్మ పరిపూర్ణుఁడై యున్నాఁడు. అతఁడే నానారూపుఁడై, అభివ్యక్తుఁడగుచున్నాఁడు. అతనిని పొందిన మానవుఁడు కూడ ఇచ్ఛాను రూపమగు రూపమును ధరింపఁగల శక్తి సంపన్నుఁడగుచున్నాఁడు.

ఈవిధముగ నెవఁడు పరమాత్మ తత్త్వమును తెలిసికొని "అహం బ్రహ్మాస్మి" అని భావించునో వాఁడు కూడ పరమాత్మ స్థితిని పొందఁగల్గును. ఇట్లు భృగువల్లి యందు పరబ్రహ్మ తత్త్వ విచారము, అన్నమహిమ, అతిథి సత్కారము, బ్రహ్మోపాసకుని కర్తవ్యము, మొదలగునవి చక్కగా వివరింపఁబడినవి.

II

ఓం

# తైత్తిరీయోపనిషత్

## ప్రతిపదార్థ ముఖ్యాంశ వివరణము

## పరిధవమానంవాకము

## (శాన్తిపాఠము)

మంత్రము :-

శం నో మిత్రః శం వరుణః। శం నో భవత్వర్యమా। శం న ఇంద్రో బృహస్పతిః। శం నో విష్ణురురుక్రమః। నమో బ్రహ్మణే। నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తన్మా మవతు। తద్వక్తార మవతు। అవతు మామ్। అవతు వక్తారమ్।

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః।

అర్థము :- నః = మా కొఱకు; మిత్రః = సూర్యుఁడు (దిన, ప్రాణ-అధిపతి); శం = కల్యాణప్రదుఁడగుఁగాక!; వరుణః = వరు-ణుఁడు (రాత్రి, అపాన-అధిపతి); శం = కల్యాణప్రదుఁడగుఁగాక; అర్యమా = అర్యముఁడు; (చక్షుఃసూర్యమండలాధిపతి); నః = మా కొఱకు; శంభవతు = కల్యాణప్రదుఁడగుఁగాక!; ఇంద్రః = ఇంద్రుడు (బల భుజాధిపతి); బృహస్పతిః = వాణీ బుద్ధ్యధిష్ఠాతయగు బృహస్పతి; నః = మాకు; శం = కల్యాణకారకులగుదురు. గాక!; ఉరుక్రమః త్రివిక్రమ రూపముచే విశాల పాదముకల; విష్ణుః = విష్ణువు (పాదాధిష్ఠాత) నః = మాకు; శం = కల్యాణ కారకుఁడగుఁగాక!;

బ్రహ్మణే = బ్రహ్మకు (సమస్త దేవతలకు నాత్మస్వరూపుఁడగు); నమః = నమస్కారము; వాయో = ఓ వాయుదేవ! తే నమః = నీకు నమస్కారము; త్వమేవ = నీవే; ప్రత్యక్షం = ప్రత్యక్షరూపమగు; బ్రహ్మాసి = బ్రహ్మవు; త్వామేవ = నిన్నే; ప్రత్యక్షంబ్రహ్మ = ప్రత్యక్షమగు బ్రహ్మగా; వదిష్యామి = చెప్పుదును; ఋతం = ఋతమను పేరుతో; వదిష్యామి = పిలిచెదను; సత్యం = సత్యమను పేరుతో. వదిష్యామి = చెప్పుదును; తత్ = ఆ సర్వశక్తిమంతుఁడగు పరమేశ్వరుఁడు; మాం అవతు = నన్ను రక్షించుఁగాక!; తత్ = ఆ; వక్తారం = గురువును; అవతు = రక్షించుఁగాక!; అవతు మామ్ = నన్ను రక్షించుఁగాక!; అవతు వక్తారం = గురువును రక్షించుఁగాక!; ఓం శాన్తిః శాన్తిః శాన్తిః।

వ్యాఖ్య :- అధిభౌతిక, అధ్యాత్మిక, అధిదైవికములను త్రివిధములగు విఘ్నములను నివారించుటకు ముమ్మారు 'శాన్తి' ప్రవచింపఁబడినది. 'తన్మామవతు, తద్వక్తారమవతు! అవతుమాం, అవతు వక్తారమ్' అని ద్విరుక్తి శాన్తిపాఠము పరిసమాప్తి యగుటను సూచించును. ఈ ప్రకరణమున నీయఁబడిన శిక్షానురూపముగ "మానవుఁడు తన జీవితమును దిద్దుకొనును. ఇహలోక పరలోకములకు సంబంధించిన సర్వోత్తమ ఫలములనుపొందఁగల్గును; బ్రహ్మ విద్యా గ్రహణము నందు సమర్థుఁడగును." అను భావమును తెల్పుచున్నది. కనుకనే దీనికి "శిక్షావల్లి" అని పేరు పెట్టఁబడినది.

## ద్వితీయానువాకము
## ( వేదోచ్చారణ విధానము )

మంత్రము :- శీక్షాం వ్యాఖ్యాస్యామః। వర్ణః స్వరః। మాత్రా బలమ్। సామ సన్తానః। ఇత్యుక్తః శీక్షాధ్యాయః॥

అర్థము:- శిక్షాం = శిక్షను గూర్చి, వ్యాఖ్యాస్యామః = వ్యాఖ్యా సింతము(వర్ణింతము); వర్ణః = వర్ణము; స్వరః = స్వరము (నిహ్నో చోచ్చేదాత్తాది); మాత్రా = మాత్ర(హ్రస్వదీర్ఘప్లుతములు); బలమ్ = ప్రయత్నము (బాహ్యాభ్యన్తర); సామ = సామగానము; సంతానః = సంధి (సంహిత మఱియు ప్రకృతి భావం) ఇతి = ఈవిధము శీక్షాధ్యాయః = వేదోచ్చారణము యొక్క శిక్షాధ్యాయము; ఉక్తః = చెప్పఁబడినది.

వ్యాఖ్య:- వేదోచ్చారణ నియమములను వర్ణించుచు, గురువు వా సంకేతములను దెల్పుచున్నాఁడు. వర్ణోచ్చారణమున, నిహ్నోచ్చా రణాది స్వరోచ్చారణమునను మిక్కిలి ధ్యానమవసరము. అపశబ్దము లనిష్టకారకములు. బాహ్యాభ్యంతర భేదములను స్పష్టముగ నెఱిఁగి పఠింపవలెను. ఈవిధముగ వర్ణోచ్చారణమున స్వరము, మాత్ర. ప్రయత్నము, సామగానరీతి, సంధి, ప్రకృతి భావము అను ఆఱు నియమములను మిక్కిలి శ్రద్ధతో పాటింపవలసి యున్నది.

"దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న తదర్థమాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్ర శత్రుః స్వరతోఽపరాధాత్॥"

అని పతంజలి మహాభాష్యమున వివరించి యున్నాఁడు. 'ఇంద్రశత్రు' శబ్దము నందలి స్వరదోష కారణముననే వృత్రా సురుఁడు స్వయముగ నింద్రునిచే హతుఁడయ్యెను కదా!

# తృతీయానువాకము
# ( మహా సంహితా వివరణము )

శాంతిమంత్రము: సహ నౌ యశః। సహ నౌ బ్రహ్మ వర్చసమ్। అథాతః సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః। పంచస్వధికరణేషు। అధిలోక - మధిజ్యౌతిష - మధివిద్య - మధిప్రజ_మధ్యాత్మమ్। తా మహా సగ్ంహితా ఇత్యాచక్షతే।

అథాధిలోకమ్। పృథివీ పూర్వరూపమ్। ద్యౌరుత్తర రూపమ్। ఆకాశః సన్ధిః। వాయుః సన్ధానమ్। ఇత్యధిలోకమ్।

అథాధిజ్యౌతిషమ్। అగ్నిః పూర్వరూపమ్। ఆదిత్య ఉత్తరరూపమ్। ఆపః సన్ధిః। వైద్యుతః సన్ధానమ్। ఇత్యధిజ్యౌతిషమ్।

అథాధి విద్యమ్। ఆచార్యః పూర్వరూపమ్। అన్తేవాస్యుత్తరరూపమ్। విద్యా సన్ధిః। ప్రవచనమ్ సన్ధానమ్। ఇత్యధివిద్యమ్।

అథాధి ప్రజమ్। మాతా పూర్వరూపమ్। పితోత్తరరూపమ్। ప్రజా సన్ధిః। ప్రజననగ్ం సన్ధానమ్, ఇత్యధిప్రజమ్।

అథాధ్యాత్మమ్। అధరా హనుః పూర్వరూపమ్, ఉత్తరా హనురుత్తరరూపమ్। వాక్సన్ధిః। జిహ్వా సన్ధానమ్। ఇత్యధ్యాత్మమ్।

ఇతీమా మహాసగ్ంహితా య ఏవమేతా మహాసగ్ంహితా వ్యాఖ్యాతా వేద। సందీయతె ప్రజయా పశుభిః బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సువర్గేణ లోకేన॥

పదార్థము : నౌ = మాయిరువురయొక్క (గురుశిష్యులు); యశః = కీర్తి; సహ = సమముగా(కలసి) వృద్ధి పొందుగాక।; సహ = కలిసి; నౌ = మాయిరువురయొక్క; బ్రహ్మవర్చసం = బ్ర

తేజస్సు కూడ అభివృద్ధి పొందుగాక!; అథ = ఇట్టి శుభ వాంఛను ప్రకటించిన పిమ్మట; అతః = ఇకనుండి మనమిరువురము; అధి లోకం = లోకముల విషయమున; అధిజ్యౌతిషం = జ్యోతిస్సుల విషయమున; అధి విద్యం = విద్యా విషయమున; అధి ప్రజం = ప్రజలవిషయమున; అధ్యాత్మం = శరీరము విషయమున; పంచసు = అధికరణేషు = ఐదుస్థానముల యందును; సగ్ంహితాయాః = సంహితయొక్క, ఉపనిషదం = రహస్యమును, వ్యాఖ్యాస్యామః = వర్ణనచేయుదుము; తాః = వీనినన్నింటిని; మహాసగ్ంహితా ఇతి = మహాసంహితయనునామమున; ఆచక్షతే = పిలుచుచున్నారు;

అథ = వీనిలో; అధిలోకం = లోకవిషయ సంహితకు; పృథివీ పూర్వరూపం = భూమి పూర్వవర్ణము; ద్యౌరుత్తర రూపం = దివి ఉత్తరవర్ణము; ఆకాశః సన్ధిః = ఆకాశముసంధి; వాయుః సన్ధానం = పై రెండింటికి సంయోజకము వాయువు. ఇత్యధిలోకం = ఇది లోకవిషయక సంహిత; సంహిత యొక్క ఉపాసనా విధియును; ఇట్లే తక్కిన నాల్గింటిని ఈ క్రింది విధముగ గ్రహింపనగును.

మహా సంహితా స్వరూపము

| సంహిత | పూర్వ రూపము | ఉత్తర రూపము | సంధి | సంధానము |
|---|---|---|---|---|
| అధిలోకం | పృథివీ | ద్యౌః | ఆకాశః | వాయుః |
| అధిజ్యౌతిషం | అగ్నిః | ఆదిత్యః | ఆపః | వైద్యుతః |
| అధివిద్యం | ఆచార్యః | అన్తేవాసి | విద్యా | ప్రవచనం |
| అధిప్రజం | మాతా | పితా | ప్రజాః | ప్రజననం |
| అధ్యాత్మం | అధరాహనుః (క్రింది దౌడ ఎముక) | ఉత్తరా హనుః (పై దౌడ ఎముక) | వాక్ | జిహ్వా |

ఇతి=ఈవిధముగ; ఇమాః = ఈ; మహాసగ్ంహితా = పంచ మహా సంహితలు చెప్పఁబడినవి; యః=ఏమానవుఁడు; ఏవం=ఈవిధముగ; వ్యాఖ్యాతాః=పైన వివరింపబడిన; మహాసగ్ంహితాః=మహా సంహితలను; వేద=తెలిసికొనుచున్నాఁడో అతఁడు; ప్రజయా=సంతానము తోడను; పశుభిః=పశువులతోడను, బ్రిహ్మవర్చసేన=బ్రహ్మతేజస్సు తోడను; అన్న + ఆద్యేన =అన్నాది భోగ్యపదార్థములతోడను; సువర్గేణలోకేన = స్వర్గలోక ప్రాప్తితోడను; సంధీయతే = సంపన్నుఁ డగు చున్నాఁడు.

వ్యాఖ్య:- లోక విషయక సంహితాజ్ఞానముచే స్వర్గాద్యుత్తమలోక ప్రాప్తి, జ్యోతీవిషయక సంహితాజ్ఞానముచే నానావిధములగు భౌతిక సామగ్రి, ప్రిజావిషయక సంహితా జ్ఞానముచే సంతానము, విద్యా విషయక సంహితా జ్ఞానముచే విద్య మఱియు బ్రహ్మ తేజము, అధ్యాత్మ విషయక సంహితాజ్ఞానముచే వాక్ఛక్తిఫలములుగా భావింప వచ్చును. శ్రుతి ఈశ్వరవాణి. తద్రహస్యము నెఱింగి శ్రద్ధా విశ్వాస ములతో పై ఉపాసన చేయువారు సమస్తఫలముల నొందఁగలరు.

## చతుర్థానువాకము
## ( గురువు యొక్క లౌకిక పారలౌకిక విధులు - హోమవిధి )

మంత్రము :-

**1.** యశ్ఛందసామృషభో విశ్వరూపః। ఛందోభ్యోఽధ్యమృతాత్సంబభూవ। స మేంద్రో మేధయా స్పృణోతు। అమృతస్య దేవ ధారణో భూయాసమ్। శరీరం మే విచర్షణమ్। జిహ్వా మే మధు

మత్తమా। కర్ణాభ్యాం భూరి విశ్రువమ్। బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః। శ్రుతం మే గోపాయ॥

2. ఆవహన్తీ వితన్వానా కుర్వాణాచీరమాత్మనః। వాసాగ్ంసి మమ గావశ్చ। అన్నపానే చ సర్వదా। తతో మే శ్రియమావహ। లోమశాం పశుభిః సహ స్వాహా॥

3. ఆమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా। విమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా। ప్రమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా। దమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా। శమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా॥

4. యశో జనేఽసాని స్వాహా। శ్రేయాన్ వస్యసోఽసాని స్వాహా। తం త్వా భగ ప్రవిశాని స్వాహా। స మా భగ ప్రవిశ స్వాహా। తస్మిన్ సహస్రశాఖే ని భగాహం త్వయి మృజే స్వాహా॥

5. యథాఽఽపః ప్రవతాఽయన్తి యథా మాసా అహర్జరమ్। ఏవం మాం బ్రహ్మచారిణో ధాతరాయన్తు సర్వతః స్వాహా॥ ప్రతివేశోఽసి ప్ర మా భాహి ప్ర మా పద్యస్వ॥

అర్థము:- 1. యః=ఎవఁడు; ఛందసాం=వేదములలో; ఋషభః=సర్వశ్రేష్ఠుఁడో; విశ్వరూపః=సర్వరూపుఁడో; అమృతాత్ = అమృతస్వరూపములగు; ఛందోభ్యః=వేదములనుండి; అధి=ప్రధానరూపమున; సంబభూవ = సంభవించినవాఁడో; సః = ఆ ఓంకారస్వరూపుఁడగు; ఇన్ద్రః=సర్వాధిపతియగు పరమేశ్వరుఁడు; మా=నన్ను; స్పృణోతు=సంపన్నునిచేయుఁగాక!; దేవ!=ఓదేవా! నేనునీవలన; అమృతస్య ధారణః=అమృతమయ పరమాత్మను నాహృదయమున ధరించువాఁడను; భూయాసమ్ = కాగలను; మే శరీరమ్ = నా శరీరము; విచర్షణమ్ = సర్వవిధముల రోగరహితమగుఁగాక!; మే జిహ్వా = నా

నాలుక; మధుమత్తమా = మధురభాషిణియగుఁగాక!; కర్ణాభ్యాం = చెవులతో; భూరివిశ్రువమ్ = నిన్నుఁగూర్చి యధికముగా విందునుఁగాక; (నీవు) మేధయాపిహితః = లౌకికబుద్ధితోఁకప్పఁబడియున్న; బ్రహ్మణః = బ్రహ్మ యొక్క (పరమాత్మ యొక్క); కోశఃఅసి = నిధివైయున్నావు; మే = నాయొక్క; శ్రుతం = వినియున్న ఉపదేశమును; గోపాయ = రక్షింపుము.

వ్యాఖ్య:- పరబ్రహ్మ ప్రాప్తికొఱకవసరమగు శారీరక బుద్ధి బలములను పొందుటకు పరమేశ్వరుని (వాని ప్రసిద్ధ నామమగు నోంకారము ద్వారా) ప్రార్థించు విధానము చెప్పఁబడుచున్నది. ఓంకారము సర్వశ్రేష్ఠము; తదుచ్చారణము సర్వవేదోచ్చారణ ఫలప్రాప్తికి సమానము; ఓంకార పరమేశ్వర నామములభిన్నములు. అట్టి ప్రణవరూపమగు పరమాత్మ సర్వాధికుఁడగుటచే "ఇంద్ర" నామమున ప్రసిద్ధుఁడు.

2. ఐశ్వర్య ప్రాప్తికొఱకు అగ్నిలో నాహుతి చేయు విధము :-

అర్థము:- అనంతరము (ఐశ్వర్యమును పొందు విధము చెప్పఁబడుచున్నది.) మమ = నా యొక్క; ఆత్మనః = సొంతముకొఱకు; అచిరమ్ = వెంటనే; వాసాంసిచ = వస్త్రములును; గావశ్చ = గోవులను; అన్నపానే = అన్నపానములును; సర్వదా = ఎల్లప్పుడును; ఆవహన్తీ = కల్గించువాఁడవై; వితన్వానా = వానిని విస్తరించువాడవై; కుర్వాణా = వానినితయారుచేయువాఁడవై; లోమశాంపశుభిఃసహ = రోమములుకల పశువులతో కూడినట్టి; (తాం = ఆ) శ్రియం = సంపదను; మేఆవహ = నాకుకలిగింపుము; స్వాహా = ఈ ఉద్దేశ్యముతో నాహుతి చేయుచున్నాను.

వ్యాఖ్య:- ఈ మంత్రము నుచ్చరించి స్వాహా శబ్దముతో నగ్నిలో నాహుతి చేసినచో నది యైశ్వర్య ప్రాప్తి సాధకమగును.

3. గురువు శిష్యహితార్థము హవనము చేయు విధానము :-

అర్థము :- బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు; మా = నా వద్దకు; ఆయన్తు = వచ్చెదరు గాక!; బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు; విమాయన్తు = నిష్కపటులగుదురుగాక!, స్వాహా = అనిఆహుతిచేయ వలెను; బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు; ప్రమాయన్తు = ప్రామాణికజ్ఞానమునుగ్రహింతురుగాక!; స్వాహా = అనిఆహుతిచేయవలెను; బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు; దమాయన్తు = ఇంద్రియములను అధీనములో నుంచుకొందురుగాక!, స్వాహా = అని ఆహుతి చేయ వలెను; బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు; శమాయన్తు = శాన్త స్వభావమును పొందియుందురుగాక!; స్వాహా = అని ఆహుతి చేయ వలెను.

వ్యాఖ్య :- ఇట్లు గురువు తన శిష్యులహితమును గోరి హవనము గావించును.

4. గురువు తన లౌకిక పారలౌకిక హితార్థము హవనము చేయుట :

అర్థము :- జనే = జనులలో; యశఃఅసాని = యశస్వినగుదును గాక! (స్వాహా); వయసః = మహాధనవంతులలో; శ్రేయాన్అసాని = అధికధనవంతుఁడ నగుదునుగాక; (స్వాహా); భగ = భగవంతుఁడా!; తంత్వా = ఆనిన్ను; ప్రవిశాని = నేను ప్రవిష్టుఁడనగుదును గాక! (స్వాహా) భగ!; = ఓభగవంతుఁడా! సమా = ఆ నీవు నన్ను; ప్రవిశ = ప్రవేశింపుము; (స్వాహా); భగ = ఓ భగవంతుఁడా! తస్మిన్సహస్రశాఖే = వేలకొలదిశాఖలుకల; త్వయి = నీయందుధ్యానము ద్వారా నిమగ్నుఁడనై; అహం = నేను, నిమృజే = స్వయముగ విశుద్ధుఁడనగుదునుగాక! (స్వాహా)

వ్యాఖ్య :- గురువు ఈఉద్దేశ్యములతో మంత్రోచ్చారణ పూర్వకముగ స్వాహా శబ్దముతో అగ్నియందాహుతి చేయవలెను.

౯. అర్థము:- యథా = ఏవిధముగ; ఆపః = నద్యాదుల జలము, ప్రవితా = నిమ్న స్థానమునుండి; యన్తి = సముద్రమునకు పోవుచున్నదో; యథా = ఏవిధముగ; మాసాః = నెలలు, అహర్జరమ్ = దినములు మొదలగునవి కాల పరివాహమున కదలిపోవుచున్నవో; అక్లే; హేధాతః = ఓ దైవమా!; ఏవం = ఈ విధముగ; మమ = నా యొక్క; సర్వతః = అన్ని వైపుల నుండి; బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు (శిష్యులు); ఆయన్తు = వచ్చుదురుగాక; (స్వాహా) ప్రతివేశః అసి = నీవు అందఱకును విశ్రామ స్థానమవైయున్నావు; మా పరిభాహి = నన్ను పరికాశింపఁజేయుము; మా ప్రపద్యస్వ = నాకు (నీ దివ్య రూపమును) లభింపఁజేయుము.

వ్యాఖ్య:- ఈ విధముగ నీయనువాకమున నిహలోక పరలోకముల యున్నతికై పరమాత్మను ప్రార్థించుట, హవనము చేయుట చెప్పఁబడినది. తన కల్యాణముఁగోరు మానవుఁడు ఇందు చెప్పఁబడిన అన్ని యంశములను అవశ్యమనుష్ఠించి ప్రయోజనము పొందుట శ్రేయస్కరము.

## పంచమానువాకము

## (వ్యాహృతి చతుష్టయము)

1. మంత్రము:- భూర్భువః సువరితి వా ఏతాస్తిస్రో వ్యాహృతయః। తాసాము హ స్మైతాం చతుర్థీ మాహాచమస్యః ప్రవేదయతే। మహ ఇతి। తద్బ్రహ్మ। స ఆత్మా। అఙ్గాన్యన్యా దేవతాః। భూరితి వా అయం లోకః। భువ ఇత్యన్తరిక్షమ్। సువరిత్యసౌ లోకః మహ ఇత్యాదిత్యః। ఆదిత్యేన వావ సర్వే లోకా మహీయన్తే।

అర్థము:- భూః, భువః, సువః, ఇతి=అను; ఏతాః=ఇవి; వై=ప్రసిద్ధములయిన; తిస్రః వ్యాహృతయః = మూడు వ్యాహృతులు కలవు; తాసాం=ఆమూడింటి అపేక్షచే; చతుర్థీ=నాల్గవ వ్యాహృతి; మహః=మహో వ్యాహృతియని; హ=ప్రసిద్ధిచెందినది; ఏతాం = దీనిని; మాహాచమస్యః=మహాచమసుని పుత్రుఁడు; ప్రవేదయతేస్మ = మొదటుగా తెలిసికొనెను; తత్=ఆ నాల్గవ వ్యాహృతియే; బ్రహ్మ=బ్రహ్మము; సః=అది; ఆత్మా=పైన చెప్పఁబడిన వ్యాహృతులకు నాత్మ; అన్యాః దేవతాః=ఇతర సమస్త దేవతలు; అంగాని=దానికి అంగములు; భూరితి వ్యాహృతిః అయంలోకః = ఈ లోకమునకు "భూః" అని పేరు; భువ ఇతి వ్యాహృతిః అన్తరిక్షమ్ = అన్తరిక్షము "భువః" అను వ్యాహృతి; సువఇత్యసౌలోకః = ఆప్రసిద్ధమగు స్వర్గలోకము 'సువః అనువ్యాహృతి; మహః = 'మహ' అను నీ నాల్గవ వ్యాహృతి; ఆదిత్యః = ఆదిత్యరూపము; ఆదిత్యేన వావ = ఆదిత్యుని వలననే; సర్వేలోకాః మహీయన్తే = సమస్తలోకములును మహిమాన్వితములగు చున్నవి.

వ్యాఖ్య:- ఈయనువాకమున 4వ్యాహృతుల యొక్క ఉపాసన, దాని ఫలమును చెప్పఁబడినది. వీనియందు నాల్గవది ప్రధానమయినది. కావున దానిని బ్రహ్మముగ నెఱుంగవలెను. ఇతర సమస్త దేవత్తలు బ్రహ్మమున కంగములు. కావున ఏ దేవతనైనను, ఈ వ్యాహృతుల ద్వారా ఉపాసన చేసినచో అది సర్వరూపుఁడగు పరమేశ్వరుని ఉపాసనమే యగును. 'మహః' అనగా నాదిత్యుడు. సూర్యునకు కూడా పరమేశ్వరుఁడాత్మ. అందుచే పరమేశ్వరుఁడే సూర్య రూపమున సమస్త లోకములను ప్రకాశింపఁ జేయుచున్నాఁడు.

2. మంత్రము:- భూరితి వా అగ్నిః। భువ ఇతి వాయుః సువరిత్యాదిత్యః। మహ ఇతి చంద్రమాః। చంద్రమసా వావ సర్వాణి జ్యోతీంషి మహీయన్తే।

అర్థము:- భూః ఇతివై = ఈ భూ వ్యాహృతియే; అగ్నిః = అగ్ని; భువ ఇతి = భువ వ్యాహృతి; వాయుః = వాయువు; సువరితి = సువః అను వ్యాహృతి; ఆదిత్యః = సూర్యుఁడు; మహ ఇతి = మహో వ్యాహృతి చంద్రమాః = చంద్రుఁడు; చంద్రమ సావావ = మహో వ్యాహృతి యగు నాచంద్రునివలననే; సర్వాణిజ్యోతీగ్ంషి = సమస్త జ్యోతిస్సులును; మహియన్తే = మహిమాన్వితములగుచున్నవి.

వ్యాఖ్య:- అగ్ని వాక్కునకు (వాణి), వాయువుత్వక్కునకు (స్పర్శ), ఆదిత్యుఁడు చక్షువునకు (రూపము) అధిష్ఠాతలు. ఇక చంద్రుఁడు మనస్సునకు (సమస్తేంద్రియ సమూహ రూపము) అధిష్ఠాత: కావుననే చంద్రుఁడు సమస్త జ్యోతిస్సులలో, ఇంద్రియములలో మనస్సువలె ప్రధానుఁడగును. కావుననే చంద్రుఁడు మహోవ్యాహృతి అని గ్రహింపఁదగినది.

౩. మంత్రము:- భూరితి వా ఋచః। భువ ఇతి సామాని। సువరితి యజూంషి। మహ ఇతి బ్రహ్మ। బ్రహ్మణా వావ సర్వే లోకా మహీయన్తే॥

అర్థము:- భూఃఇతివై = ఈభూవ్యాహృతియే; ఋచః = ఋగ్వేదము; భువ ఇతి సామాని = భువ వ్యాహృతియే సామవేదము; సువ ఇతి బ్రహ్మ = మహోవ్యాహృతియే బ్రహ్మము. (అనగా నథర్వవేదము. యజూంషి = సువ వ్యాహృతియే యజుర్వేదము; మహ ఇతి ఎందుచేతనగా) బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయన్తే = బ్రహ్మము వలననే సమస్త వేదములు మహిమాన్వితములగుచున్నవి.

వ్యాఖ్య:- ఇందు వేదములలో ఈవ్యాహృతులను భావించి ఉపాసన చేయుట చెప్పబడినది. భూః భువః సువః మహః అను నాల్గు వ్యాహృతులు క్రమముగ ఋగ్యజుస్సామాథర్వములుగా చెప్పఁబడినవి. వేదములలో వర్ణింపఁబడిన సమస్త జ్ఞానము పరమేశ్వరుని నుండియే

ప్రకటితమై వ్యాప్తమైనది. ఆపరమేశ్వరతత్త్వమే వేదములలో వర్ణింపబడినది.

4. మంత్రము:- భూరితి వై ప్రాణః। భువ ఇత్యపానః। సువరితి వ్యానః। మహ ఇత్యన్నమ్। అన్నేన వావ సర్వే ప్రాణా మహీయన్తే। తా వా ఏతాశ్చతస్రశ్చతుర్ధా। చతస్రశ్చతస్రో వ్యాహృతయః। తా యో వేద। స వేద బ్రహ్మ। సర్వేఽస్మై దేవా బలిమావహన్తి॥

అర్థము:- భూరితివై ప్రాణః = భూవ్యాహృతియే ప్రాణము; భువ ఇత్యపానః = భువ వ్యాహృతి అపానవాయువు, సువరితివ్యానః = సువ వ్యాహృతియే వ్యాన వాయువు; మహఇత్యన్నమ్ = మహో వ్యాహృతియే అన్నము;(ఎందుచేతననగా) అన్నేనైవ సర్వేప్రాణా మహీయన్తే = అన్నము వలననే సమస్త ప్రాణములు మహిమాన్వితములగుచున్నవి; తాఃవై =అవియే; ఏతాః చతస్రః = ఈ నాల్గు వ్యాహృతులును; చతుర్ధాః =నాల్గు విధములు; చతస్రః చతస్రః= ఒక్కొక్కటి మరల నాలుగేసి విధములై మొత్తము 16; వ్యాహృతయః = వ్యాహృతులగుచున్నవి; తాయఃవేద = వానినెవఁడు తెలిసికొనుచున్నాఁడో; సబ్రహ్మవేద = అతఁడు బ్రహ్మమును తెలిసికొనును; అస్మై =ఈబ్రహ్మవేత్త కొఱకు; సర్వేదేవాః= సమస్తదేవతలును; బలిం అవహన్తి = కానుకలను సమర్పింతురు.

వ్యాఖ్య:- ప్రాణముల విషయమున ఈవ్యాహృతులను ప్రయోగించి ఉపాసన చేయు విధానమిచ్చట చెప్పఁబడినది. భూర్భువస్సువ వ్యాహృతులు క్రమముగ ప్రాణాపానవ్యాన వాయువులుగ చెప్పఁబడినవి. అన్నము నాల్గవది యగు మహోరూప వ్యాహృతి. వ్యాహృతులలో మహోవ్యాహృతి ప్రధానమైనది. అన్నే సమస్త ప్రాణులపాలన

పోషణాది వ్యవహారముల చూచునది కనుకనే అన్నము ప్రధాన మైనది. అందుచేతనే ప్రాణులలోని అంతర్యామియైన పరమేశ్వరుని అన్నరూపమున నుపాసన చేయవలసియున్నది. ఈవిధముగ నాల్గేసి విధములయిన నాల్గు వ్యాహృతులను ప్రయోగించి ఉపాసించు విధి, ఫలము కూడ తెలుపబడినవి. ఈవ్యాహృతి భేదముల నవగాహనము చేసికొని యెవఁడు తదనుసారము పరబ్రహ్మమగు పరమాత్మ నుపా సించునో అతఁడు బ్రహ్మవేత్తయగును. అతనిని దేవతలు మిక్కిలి యాదరింతురు.

## షష్ఠానువాకము
## (బ్రహ్మస్థానము – ప్రాప్తిమార్గము)

1. మంత్రము:– స య ఏషోఽన్తర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషో మనోమయః, అమృతో హిరణ్మయః॥

అర్థము:– సః = అతఁడు (బ్రహ్మము) యః = ఏదైతే; ఏషః = ఈ; అన్తర్హృదయే = హృదయములోపల; ఆకాశః = ఆకాశమున్నదో; తస్మిన్ = దానిలో; అయం = ఈ; హిరణ్మయః = విశుద్ధ ప్రకాశ స్వరూ పుఁడును; అమృతః = వినాశనము లేనివాఁడును; మనోమయః = మనోమయుఁడగు; పురుషః = పురుషుఁడు (అగు పరమేశ్వరుఁడు) (వసతి = నివసించుచున్నాడు.)

వ్యాఖ్య:– మనోమయుడగు పరబ్రహ్మము సమస్త ప్రాణుల అన్తరాత్మ మియై ఉన్నాఁడు. హృదయమందు అంగుష్ఠ ప్రమాణమైన ఆకాశము గలదు. ఆయాకాశమందే విశుద్ధ ప్రకాశస్వరూపుఁడును, అవినాశియు నై పరమేశ్వరుఁడు విరాజిల్లుచున్నాఁడు. అచటనే అతని సాక్షాత్కార మగును.

2. మంత్రము:- అన్తరేణ తాలుకే। య ఏష స్తన ఇవావలమ్బతే। సేన్ద్రయోనిః। యత్రాసౌ కేశాన్తో వివర్తతే। వ్యపోహ్య శీర్షకపాలే। భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి। భువ ఇతి వాయౌ। సువరిత్యాదిత్యే। మహ ఇతి బ్రహ్మణి॥

అర్థము:- అన్తరేణ తాలుకే = రెండు తాలువుల మధ్యన; యః=ఏ; ఏషః=ఈ; స్తనఇవ=స్తనసదృశమై; అవలమ్బతే=ప్రేలాడుచున్నదో, (దాని లోపల కూడ) యత్ర=ఎక్కడ; అసౌ=ఇది; కేశాన్తః=కేశములకు మూలస్థానమై; (బ్రహ్మరంధ్రము) వివర్తతే = ఉన్నదో; శీర్షకపాలే= శిరస్సు యొక్క రెండు కపాలములను; వ్యపోహ్య = భేదించి వచ్చు ఏసుషుమ్నానాడికలదో; సా = అది; ఇన్ద్రయోనిః = పరమాత్మ ప్రాప్తిద్వారము; భూః = ఈ వ్యాహృతి యొక్క అర్థ రూపము; అగ్నౌ ప్రతితిష్ఠతి = అగ్నియందు ప్రతిష్ఠింపఁబడుచున్నది; భువః = ఈవ్యాహృతి యొక్క అర్థరూపము; వాయౌ = వాయుదేవుని యందు ప్రతిష్ఠితమగుచున్నది; సువరితి = సువః అను వ్యాహృ యొక్క అర్థరూపము; ఆదిత్యే = సూర్యునియందు ప్రతిష్ఠితమగు చున్నది; మహ ఇతి =మహఃఅను వ్యాహృతియొక్కఅర్థస్వరూపము; బ్రహ్మణి =బ్రహ్మమునందు ప్రతిష్ఠితమగుచున్నది.

వ్యాఖ్య:- కొండనాలుకకు ముందు కేశములకు మూల స్థానమగు బ్రహ్మరంధ్రముకలదు. హృదయము నుండి బయలుదేరి, కొండ నాలుకలోనికిపోవుచు, రెండు కపాలములను వేఱుచేయు సుషుమ్నా నాడి మిక్కిలి ప్రసిద్ధమైయున్నది. అదియే ఇంద్రుఁడను పేరు కల పరమేశ్వరునియొక్క ప్రాప్తిస్థానము. అన్త కాలమున నా మహా పురుషుఁడు భూః అనుపేరుతో నభిహితమైన అగ్నియందు ప్రతిష్ఠితుఁ డగును. బ్రహ్మవేత్త బ్రహ్మలోకమునకు పోవుటలోముందు జ్యోతి ర్మయుఁడైన నగ్నిని, అనంతరము వాయువును చేరును. అనగా

పృథివి నుండి సూర్యలోకము వఱకు నధికారము గల వాయువును చేరును. పిమ్మట సూర్యుని అటు పిమ్మట బ్రహ్మమును చేరును.

3. మంత్రము:- ఆప్నోతి స్వారాజ్యమ్। ఆప్నోతి మనసస్పతిమ్। వాక్పతి శ్చక్షుష్పతిః। శ్రోత్రపతిర్విజ్ఞానపతిః। ఏతత్తతో భవతి॥

అర్థము:- (బ్రహ్మ లోకమును చేరిన పురుషుఁడు) స్వారాజ్యం= స్వారాజ్యమును; ఆప్నోతి=పొందును; మనసస్పతిమ్ = తన మనస్సుపై నాధిపత్యమును; ఆప్నోతి = పొందును; వాక్పతిః = వాగీశుఁడును; చక్షుష్పతిః = నేత్ర స్వామియునగును; శ్రోత్రపతిః = శ్రవణాధిపతియు; విజ్ఞానపతిః = విజ్ఞానమూర్తియునగును; తతః = ఈపైన చెప్పఁబడినసాధనచే; ఏతత్=ఈ ఫలము; భవతి=లభించును.

4. మంత్రము:- ఆకాశశరీరం బ్రహ్మ। సత్యాత్మ ప్రాణారామం మన ఆనందమ్। శాన్తి సమృద్ధమమృతమ్। ఇతి ప్రాచీన యోగ్యో పాస్వ॥

అర్థము:- బ్రహ్మ = ఆ బ్రహ్మము; ఆకాశ శరీరమ్ = ఆకాశ సదృశ శరీరము కలవాఁడు; సత్యాత్మ = సత్య స్వరూపుఁడు; ప్రాణారామం = ఇంద్రియాది సమస్త ప్రాణులకు విశ్రాంతి నొసంగువాఁడు; మన ఆనందం = మనస్సునకానందము నిచ్చువాడు; శాన్తిసమృద్ధమ్ = శాన్తిని సమృద్ధిగా నొసఁగువాఁడు; అమృతమ్ = మరణము లేనివాడు; ఇతి = అని భావించి; ప్రాచీన యోగ్యోపాస్వ = ఓ ప్రాచీన యోగ్యుఁడా! ఉపాసింపుము.

3, 4 వ్యాఖ్య:- అనంతర మాతఁడు స్వారాజ్యమును పొంది (సర్వాట్ అయి) వాక్చక్షుశ్శ్రోత్రాది సమస్తేంద్రియములకు, వాని అధిదేవతలకు విజ్ఞాన స్వరూపమగు బుద్ధికి కూడా ప్రభువగును. అనగా

పంచేంద్రియములతని కధీనములగును. కావున పైన చెప్పిన సాధనచే నీ ఫలము కలుగును. బ్రహ్మమెట్లుండును? ఎట్లు ధ్యానింపవలె నను విషయము నిట గ్రహింపఁగలము. "ఇతఁడాకాశ సదృశముగ నిరాకారుఁడు. సర్వవ్యాపి. సూక్ష్మదేహి, ఏకమాత్ర సత్యస్వరూపుఁడు, ఇంద్రియములకు విశ్రాంతి ప్రదాత. మనసునకానంద సంధాయకుఁడు. అఖండ శాంతి భండారము అవినాశి." పరమ విశ్వాసముతో నిట్లు భావించవలెను. ధ్యానింపవలెను. ఈ భావమును బోధించుటకే ఋషులు ప్రతి వాక్యన "ఇతి ప్రాచీన యోగ్యోపాస్స్వ" అనిపలికిరి. (ప్రాచీన కాలమునుండి బ్రహ్మప్రాప్తికి యోగ్యతకలవాడు ప్రాచీన యోగ్యుఁడు. లేక ఒక శిష్యుని పేరయినఁగావచ్చును.)

## సప్తమానువాకము

## (పాఙ్క్త షట్కము)



**మంత్రము:-** పృథివ్యన్తరిక్షం ద్యౌర్దిశోఽవాన్తరదిశః। అగ్నిర్వాయురాదిత్యశ్చంద్రమా నక్షత్రాణి। అప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా। ఇత్యధిభూతమ్। అథాధ్యాత్మమ్। ప్రాణో వ్యానోఽపాన ఉదానః సమానః। చక్షుః శ్రోత్రం మనో వాక్ త్వక్। చర్మం మాగ్ంసగ్ం స్నావాస్థి మజ్జా। ఏతదధివిధాయ ఋషిరవోచత్। పాఙ్క్తం వా ఇదంగ్ం సర్వమ్। పాఙ్క్తేనైవ పాఙ్క్తగ్ం స్పృణోతీతి।

**అర్థము:-** పృథివీ = పృథివీలోకము; అన్తరిక్షం = అన్తరిక్షము; ద్యౌః = స్వర్గలోకము; దిశః = దిక్కులు; అవాన్తరదిశః = మూలలు (ఇది లోక పాఙ్క్తము). అగ్నిః = అగ్ని; వాయుః = వాయువు;

ఆదిత్యః = సూర్యుడు; చంద్రమాః = చంద్రుడు; నక్షత్రాణి = నక్షత్రములు; [ఇది జ్యోతి పాఙ్క్తము] ఆపః = నీరు; ఓషధయః = ఓషధులు; వనస్పతయః = వృక్షములు; ఆకాశః = ఆకాశము; ఆత్మా = ఆత్మ (అన్నమయ శరీరము) [ఇది స్థూల పదార్థ పాఙ్క్తము]; ఇత్యధిభూతం = ఈ పై విధముగా ఆధిభౌతిక పాఙ్క్తము వివరింపబడినది; అథ = పిమ్మట; అధ్యాత్మమ్ = ఆధ్యాత్మిక పాఙ్క్తము వివరింపబడుచున్నది. ప్రాణః = ప్రాణవాయువు; వ్యానః = వ్యానవాయువు; అపానః = అపానవాయువు; ఉదానః = ఉదానవాయువు; సమానః = సమానవాయువు [అను నీ ఐదు వాయువులు కలసినది వాయు పాఙ్క్తము.] చక్షుః = నేత్రము; శ్రోత్రమ్ = చెవి; మనః = మనస్సు; వాక్ = మాట; త్వక్ = చర్మము [ఇది కరణ పాఙ్క్తము]. చర్మ = చర్మము; మాంసమ్ = మాంసము; స్నావా = నాడి; అస్థి = ఎముక; మజ్జా = ఎముకల లోపలి పదార్థము [ఇది శరీరగత ధాతు పాఙ్క్తము]

ఏతత్ = ఇది ఈ ప్రకారముగా; అధివిధాయ = సమ్యక్కల్పనకై; ఋషిః = ఋషి; అవోచత్ = పల్కెను; ఇదం సర్వం వై పాఙ్క్తమ్ = ఇది అంతయును పాఙ్క్తమునకు సంబంధించిన విషయమే. పాఙ్క్తేనైవ పాఙ్క్తమ్ = సాధకుడు ఈ ఆధ్యాత్మిక పాఙ్క్తమునుండియే బాహ్య పాఙ్క్తమును; బాహ్య పాఙ్క్తమునుండియే ఆధ్యాత్మిక పాఙ్క్తమును స్పృణోతి = పరిపూర్తి గావించుకొనుచున్నాడు.

వ్యాఖ్య: ఈ అనువాకమున ముఖ్యముగా రెండు భాగములు. ముఖ్యములగు ఆధిభౌతిక పదార్థములను లోక - జ్యోతి - స్థూల పదార్థ పంక్తులలో విభజించి, తెల్పినారు. పఙ్క్తి యొక్క (సమూహము) పాఙ్క్తము. రెండవ భాగమున ముఖ్యములగు (శరీరస్థితములగు) ఆధ్యాత్మిక పదార్థములను ప్రాణ-కరణ-ధాతు పాఙ్క్తములతో వివరించి

వివరించినారు. చిట్టచివర వాని నుపయోగించు విధము తెలుపఁబడినది. ఈ పదార్థములన్నిటిలోని పరస్పర సంబంధమును తెలిసికొని ఏ ఆధిభౌతిక పదార్థమునకు ఏ ఆధ్యాత్మిక పదార్థముతో ఎట్టి సంబంధము కల్గియున్నదో మనుజుఁడు గ్రహించును. ఆధ్యాత్మిక శక్తితో భౌతిక పదార్థముల యొక్క వికాసమును, మఱియు ఆధిభౌతిక పదార్థముల ద్వారా ఆధ్యాత్మిక శక్తుల యొక్క ఉన్నతిని గమనించును. లోకసంబంధి పాఙ్క్తము:- ప్రాణి సముదాయమగు నాల్గవ పాఙ్క్తమునకు సంబంధము. జ్యోతి పాఙ్క్తము:- కరణసముదాయమగు ౫వ పాఙ్క్తమునకు సంబంధము. ఎందుచేతననగా ఆ ఆధిభౌతిక జ్యోతులు ఈ ఆధ్యాత్మిక జ్యోతులకు సహాయకములు. స్థూల పదార్థ పాఙ్క్తము - అణువదియగు శరీరగత ధాతు పాఙ్క్తమునకు సంబంధము. ఎందుచేతననగా ఓషధి మఱియు వనస్పతి రూపమగు అన్నము నుండియే మాంస మజ్జాదులకు పుష్టి, వృద్ధి. ఈ విధముగ ప్రత్యేక స్థూల సూక్ష్మతత్త్వమును తెలిసికొని దానిని ఉపయోగించుటచే మానవుఁడన్ని విధముల నున్నతినిఁ బొందగలఁడు.

## అష్టమానువాకము

## (ఓంకారము యొక్క ఉత్కృష్టత)

మంత్రము:- ఓమితి బ్రహ్మ। ఓమితీదగ్ం సర్వమ్। ఓమిత్యేతదనుకృతిర్హ స్మ వా అప్యో శ్రావయేత్యాశ్రావయన్తి, ఓమితి సామాని గాయన్తి। ఓగ్ంశోమితి శస్త్రాణి శగ్ంసన్తి। ఓమిత్యధ్వర్యుః ప్రతిగిరం ప్రతిగృణాతి। ఓమితి బ్రహ్మా ప్రసౌతి। ఓమిత్యగ్నిహోత్రమనుజానాతి। ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ। బ్రహ్మోపాప్నవానీతి। బ్రహ్మైవోపాప్నోతి।

అర్థము:- ఓమితి బ్రహ్మ = 'ఓం' అనునది బ్రహ్మస్వరూపము, ఓమితి = ఓం అనునది; ఇదగ్ం = ఈ ప్రత్యక్ష గోచరమగుచున్న; సర్వమ్ = సమస్త ప్రపంచము; ఓమిత్యేతత్ హి వా = ఓంకారమను నీయక్షరమే నిస్సందేహముగా; అనుకృతిః = అనుమోదమగుచున్నది; స్మ= ఈవిషయము ప్రసిద్ధము; అపి = మఱియు; ఓ శ్రావయ = ఓ ఆచార్య దేవా! ఉపదేశమును నాకు వినిపింపుము అనికోరగా; ఆశ్రావయన్తి = ఓంకారముచ్చరించి శిష్యునకుపదేశము నిచ్చుచున్నారు, ఓమితి = 'ఓం' అని; (సామగాః = సామవేత్తలు) సామానిగాయన్తి = సామవేదమును గానము చేయుచున్నారు. ఓగ్ంశోమితి = ఓం శోం అనిచెప్పి; శస్త్రాణి = మంత్రములను, శగ్ంశన్తి = చదువుచున్నారు ఓమితి = 'ఓం' అని చెప్పుచు; అధ్వర్యుః = యజ్ఞమును చేయించు అధ్వర్యుడను ఋత్విక్కు (యజ్ఞమునందు యజుర్వేద మంత్రములను చదువువాడు) ప్రతిగిరం = ప్రతి మంత్రమును; ప్రతిగృణాతి=ఉచ్చరించుచున్నాడు. ఓంఇతి=ఓం అనిపలికి; బ్రహ్మ=చతుర్థఋత్విక్కగు బ్రహ్మకు; ప్రసౌతి = అనుమతి నిచ్చుచున్నాఁడు; ఓంఇతి=ఓంఅని చెప్పి; అగ్నిహోత్రం అను జానాతి = అగ్నిహోత్రము చేయుటకు ఆజ్ఞనిచ్చుచున్నాడు; ప్రవక్ష్యన్ = అధ్యయనము కొఱకుద్యమించుః బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు; ఓం ఇతి=ఓంకారోచ్చారణము గావించి: ఆహ = చెప్పుచున్నాడు; బ్రహ్మ = (నేను) వేదమును; ఉపాప్నవానితి = పొందితినని; బ్రహ్మ = అతఁడా వేదమును; ఏవ = నిశ్చయముగానే; ఉపాప్నోతి=పొందుచున్నాడు.

వ్యాఖ్య:- ఈయనువాకమునందు పరమేశ్వర నామమగు నోంకారము నెడ మానవునకు శ్రద్ధ కలిగించుటకు, ఓంకారము యొక్క మహిమ వర్ణింపఁబడినది. ఓంకారము పరమేశ్వర నామమగుటచే అది సాక్షాత్తు బ్రహ్మమే అగుచున్నది. (ఓమిత్యేకాక్షరం బ్రహ్మ = భగవద్గీత-8-13) భగవంతుని నామము కూడ భగవత్ స్వరూపమే.

ప్రత్యక్షగోచరమగుచున్న సమస్త జగత్తుఓంకారమే. అనగా బ్రహ్మము యొక్క స్థూలరూపమే. ఓంకార పూర్వకముగనే వేద పాఠ ధ్యయనాధ్యాపనములు, సామవేదగానము, యజ్ఞయాగాది కార్య కలాపములు, మంత్రోచ్చారణమును జరుగుచున్నవి. "నేను వేదమును వైదిక జ్ఞానమును పొందఁగోరుచున్నాను. అట్టి సద్బుద్ధిని నాకుఁ బ్రసాదింపు" మని ఓంకారోచ్చారణ పూర్వకముగ నోంకార రూపమగు పరమేశ్వరునిఁ బ్రార్థించి నిస్సందేహముగ ఫలితమును పొందవచ్చును. ఇట్లీ మంత్రమున నోంకారము యొక్క మహిమ వివరింపఁబడినది.

## నవమానువాకము
## (లౌకికాచార నిర్వహణము)

మంత్రము:- ఋతం చ స్వాధ్యాయ ప్రవచనేచ। సత్యం చ స్వాధ్యాయ ప్రవచనేచ। తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। దమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। శమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। అగ్నిహోత్రంచ స్వాధ్యాయ ప్రవచనేచ। అతిథయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। మానుషంచ స్వాధ్యాయ ప్రవచనేచ। ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనేచ। ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। సత్యమితి సత్యవచా రాథీతరః, తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః। స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః। తద్ధి తపస్తద్ధితపః।

అర్థము:- ఋతం = యథాయోగ్యమయిన సదాచారపాలనము; చ = మఱియు; స్వాధ్యాయ ప్రవచనే = వేదపఠనపాఠనములును అవశ్య కర్తవ్యములు; అట్లే సత్యం = సత్యభాషణమును, తపః = తపశ్చర్యః

దమః = ఇంద్రియనిగ్రహము; శమః = మనోనిగ్రహము, అగ్నయశ్చ=అగ్నిచయనము; అగ్నిహోత్రంచ = అగ్నిహోత్రకార్యము; అతిథయశ్చ = అతిథిసేవ; మానుషం=మానవోచిత లౌకిక వ్యవహార పాలనము; ప్రజాచ=గర్భాధాన సంస్కారరూపక్రియ; ప్రజనశ్చ = శాస్త్రోక్తాను సారము స్త్రీ సహవాసము; ప్రజాతిశ్చ = కుటుంబ వృద్ధి - మొదలగు నిత్యవ్యవహారములతో పాటు స్వాధ్యాయ ప్రవచనములును అవశ్యాచరణీయములని గ్రహింపవలెను. రాధీతరః = రథీతరునిపుత్రుఁడగు; సత్యవచా = సత్యవచ ఋషిచే; సత్యమితి = (వీనిలో) సత్యమే శ్రేష్ఠమని చెప్పఁబడినది; పౌరుశిష్టః = పురుశిష్టుని పుత్రుఁడగు; తపోనిత్యః = తపోనిత్య మహర్షి; తపః = తపస్సే శ్రేష్ఠమని చెప్పెను; మౌద్గల్యః = ముద్గలుని పుత్రుఁడగు; నాకః = నాక మహర్షి; స్వాధ్యాయ ప్రవచనే = వేదపఠన పాఠనములే శ్రేష్ఠమని చెప్పెను; హి = ఎందుచేతననగా; తత్ తపః = అదియే తపస్సు; తద్ హి తపః=అదియే నిశ్చయముగా తపస్సు.

వ్యాఖ్య:- లౌకిక నియమ పాలనముతోపాటుగ వేదాధ్యయ నాధ్యాపనములును అవశ్యకర్తవ్యములని ఇది వివరించుచున్నది. వానివలననే కర్తవ్యపాలనము, ఫలమునకు సంబంధించిన జ్ఞానము కలుగును. అందుచేతనే ఈకార్యక్రమమును నిర్వహించుచునె సదాచార పాలన సత్యభాషణాదులను నిర్వహింపవలెను. పై ఋషిత్రయము చెప్పిన విషయములును యథార్థములే. ఎందుచేతననగా ప్రతికర్మయందును, ఈమూడింటి యొక్క ప్రాధాన్యతయునవసరమే. ఏపనిఁజేసినను, అవి పఠన పాఠనోపలబ్ధమగు శాస్త్ర జ్ఞానమున కనుకూలమైయుండవలెను. ఎన్నివిఘ్నములెదురైనను తన కర్తవ్య పాలనము నందు దృఢచిత్తుఁడై యుండవలెను. ప్రతి పనియందు సత్యభావము, సత్యభాషణమునందు విశేషధ్యానము కలిగియుండవలెను.

# దశమానువాకము

## ( సంకల్పసిద్ధి )

మంత్రము:- అహం వృక్షస్య రేరివా। కీర్తిః పృష్ఠం గిరేరివ। ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృతమస్మి। ద్రవిణగ్ం సవర్చసమ్। సుమేధా అమృతోక్షితః। ఇతి త్రిశంకోర్వేదానువచనమ్॥

అర్థము:- అహం = నేను; వృక్షస్య = సంసార వృక్షమును; రేరివా = ఛేదించువాఁడను; కీర్తి = నాకీర్తి; గిరేఃపృష్ఠమివ = గిరి శిఖరము వలె ఉన్నతమయినది, వాజిని = అన్నోత్పాదక శక్తికల సూర్యుని యందు; స్వమృతమివ = ఉత్తమ పదార్థమువలె (నేనుంటిని), ఊర్ధ్వ పవిత్రఃఅస్మి = మిక్కిలి పవిత్రుఁడనగు అమృత స్వరూపమునైయున్నాను; ద్రవిణగ్ం = ధనాగారమునైయున్నాను; అమృతోక్షితః = అమృతముచే నభిషించితమయిన; సుమేధా = శ్రేష్ఠమగు బుద్ధికల వాఁడను; ఇతి = ఇది; త్రిశఙ్కోరేదానువచనమ్ = త్రిశంకుమహర్షి యొక్క అనుభవ పూర్వకమయిన వైదిక ప్రవచనము.

వ్యాఖ్య:- ఇది పరమాత్మను పొందిన త్రిశంకు మహర్షియొక్క అనుభవ పూర్వకమయిన ఉపదేశము. ఆతనివచనానుసారము—

'పరమాత్మను భావించుట కూడ పరమాత్మ ప్రాప్తికి సాధకమగును' అని తెలియవలెను. దీనిని వివరించుటయే ఈ యనువాకోద్దేశము. మానవుడే ప్రకారముగ భావించునో అట్లగును. అనగా అతని సంకల్పము నందు అపూర్వము, ఆశ్చర్య జనకమునగు శక్తి కలదు. కాని ఈ సంకల్పము సత్సంకల్పము కావలెను. దాని యందు పరిపూర్ణమయిన సావధానతయు నుండవలెను. ఆతని భావమున కనుగుణముగ గుణవంతుఁడుగ కాక దురభిమాన వంతుఁ

డనయినచో పతనము ప్రాప్తించును. కావున వేదాను వచన రహాస్యమును చక్కగా నెఱింగి సత్సంకల్పము కల్గియున్నచో దురభిమానమగు నాశంకయే ఉత్పన్నము కాదు.

## ఏకాదశానువాకము
## (ఆచార్యాను శాసనము)



మంత్రము:- వేదమనూచ్యాచార్యోఽన్తే వాసిన మనుశాస్తి। సత్యం వద। ధర్మం చర। స్వాధ్యాయాన్మా ప్రమదః। ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః। సత్యాన్న ప్రమదితవ్యమ్। ధర్మాన్న ప్రమదితవ్యమ్। కుశలాన్న ప్రమదితవ్యమ్। భూత్యై న ప్రమదితవ్యమ్। స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్। దేవ పితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్।

అర్థము:- వేదమనూచ్య=వేదమును చక్కగానధ్యయనము చేయించి: ఆచార్యః = గురువర్యుఁడు; అన్తే వాసినమ్ = తన యాశ్రమమునందే నివసించు బ్రహ్మచారియగు విద్యార్థికి; (తన శిష్యుని) అనుశాస్తి = శిక్షఁగఱపును; (ఇట్లు) సత్యంవద=సత్యము పలుకుము; ధర్మంచర = ధర్మాచరణమును గావింపుము; స్వాధ్యాయాత్ = వేదాధ్యయనమువలన; మాప్రమదః = ప్రమాదపడకుము; (అనగా వేదాధ్యయనము నెడ న నాదరము చూపకుమని). ఆచార్యాయ = గురువుకొఱకు; ప్రియంధనం = దక్షిణ రూపమయిన ధనమును; ఆహృత్య =తెచ్చి; (పిమ్మట గుర్వాజ్ఞచే గృహస్థాశ్రమమును ప్రవేశించి) ప్రజాతంతుమ్ = సంతానపరంపరకు; మావ్యవచ్ఛేత్సీః=విచ్ఛేదము కల్గింపకుము. (అనగా సంతాన పరంపరకు లోపము రానీక దానిని సురక్షితము గావింపుము.)

సత్యాత్=సత్యమువలన; న ప్రమదితవ్యమ్=ప్రమాదపడకుము; (అనగా సత్యభాషణము నెన్నటికి వీడవలదని); ధర్మాన్న ప్రమదితవ్యమ్=ధర్మమువలన ప్రమాదపడకుము; కుశలాన్నప్రమదితవ్యమ్ = శుభకర్మాచరణము వలన ప్రమాదపడకుము; భూత్యైన ప్రమదితవ్యమ్= ఉన్నతి కొఱకగు సాధనల నుండి ప్రమాద పడకుము; స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్=వేదాధ్యయన అధ్యాపనముల నుండి ప్రమాదపడకుము; దేవ పితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్=దేవ పితృ కర్మాచరణము వలన ప్రమాదపడకుము.

వ్యాఖ్య:- గృహస్థుఁడు తన జీవనము నెట్లొనరింప వలెనో ఈయనువాకమున చక్కఁగా వివరింపఁబడినది.

తన శిష్యుని చక్కగ నధ్యయనము చేయించి, గృహస్థాశ్రమమునఁ బ్రవేశపెట్టి, యాచార్యుఁడు గృహస్థాశ్రమ ధర్మ పరిపాలనమును గూర్చి యుపదేశించుచున్నాఁడు. సత్య ధర్మములను గౌరవించుట, వేదాధ్యయనమును మరువకుండుట, సంతాన పరంపరకు లోపము రానీయకుండుట, స్వాధ్యాయ ప్రవచనములు, శుభ కర్మాచరణములు, ఉన్నత మార్గానుసరణము మున్నగు ముఖ్యాచరణీయాంశములను వివరించి చెప్పియున్నాఁడు. ఇందు సత్యధర్మముల పాలనము, స్వాధ్యాయ ప్రవచనములత్యావశ్యకములు. దేవ పితృ కార్యములనగా అగ్నిహోత్ర శ్రాద్ధతర్పణాదులు. వీనియందెప్పుడు అలస భావము, అవహేళన లేక ప్రమాదపడుటకాని జరుగరాదు.

మంత్రము:- మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని। నో ఇతరాణి। యాన్యస్మాకగ్ం సుచరితాని। తాని త్వయోపాస్యాని। నో ఇతరాణి। యే కే చాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణాః। తేషాం

త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్। శద్ధయా దేయమ్। అశ్రద్ధయా దేయమ్। శ్రియా దేయమ్। హ్రియా దేయమ్। భియా దేయమ్। సంవిదా దేయమ్॥

అర్థము:- మాతృదేవోభవ = తల్లియే దైవముగా కలవాని వగుము; పితృదేవోభవ = తండ్రియే దైవముగా కలవానివగుము; ఆచార్య దేవోభవ = గురువును దైవముగా కలవానివగుము; అతిథిదేవోభవ = అతిథియందు దేవభావము కలవాని వగుము. యాని అనవద్యాని కర్మాణి=ఏ నిర్దుష్టములయిన కర్మములైతేఉన్నవో; తాని సేవితవ్యాని =ఆ కర్మములే ఆచరణయోగ్యములయినవి; నోఇతరాణి=దోషయుక్త ములయిన ఇతర కర్మములు ఆచరింపఁదగనివి; అస్మాకం = మన యొక్క (ఆచరణముల నుండి కూడ); యాని సుచరితాని = ఏవిసదా చరణీయములో;(అవి) త్వయా = నీచేత; ఉపాస్యాని=ఉపాసింపఁదగి నవి; నోఇతరాణి = ఇతరములైనవికాదు; యేకేచ అస్మత్ శ్రేయాంసః బ్రాహ్మణాః = ఎవరయిన మనకు సంబంధించిన గురుజనాది శ్రేష్ఠ బ్రాహ్మణులు వచ్చినచో; తేషాం = అట్టి శ్రేష్ఠులకు; త్వయా = నీచేత; ఆ సనేన ప్రశ్వసి తవ్యం = ఆసన దానాది సేవా మూలక ముగ విశ్రాంతిని కల్గింప వలసియున్నది. శ్రద్ధయాదేయమ్=శ్రద్ధా పూర్వకముగ దానము చేయవలెను; అశ్రద్ధయా అదేయమ్ = శ్రద్ధా రహితముగ దానమీయవలదు; శ్రియా దేయమ్ = ఆర్థికస్థిత్యను సారము దానమీయఁదగినది; హ్రియాదేయమ్ = సిగ్గుపడుచు(గర్వి ష్ఠియైకాక) దానమీయవలెను, భియాదేయమ్ = భయముతో నీయఁ దగినది; సంవిదాదేయమ్ = వివేకపూర్వకముగ నీయఁదగినది.

వ్యాఖ్య:- గృహస్థుఁడు తన జీవనము నెట్లాచరింపవలెననునది వివరిం పఁబడుచున్నది. ఈ భాగమున తల్లి, తండ్రి, యాచార్యుల స్థానము

గ్రహింపఁదగినది. అటులనే అతిథిస్థానమును. సదాచారపాలన మత్యంతావశ్యకము. గురుజనాది బ్రాహ్మణోత్తములను గౌరవించి, సత్కరించి, దానముల నొసంగి సేవింపవలెను. ఆ దానము కూడ తన ఆర్థిక స్థితికి తగినట్లుగ, అహంకార రహితముగ, శ్రద్ధా వివేక సహితముగ నీయఁబడవలయును; అదియును నిష్కామ భావముతో జరుగుట ప్రశంసనీయము. ఈ సందర్భమున నీ గీతావాక్యములు స్మరింపఁదగియున్నవి. శ్రద్ధాత్రయ విభాగ యోగమున - (17 వ అధ్యాయం)

శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్। (20)

శ్లో॥ అశ్రద్ధయాహుతం, దత్తం, తపస్తప్తం, కృతంచయత్
అసదిత్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్య నో ఇహ! (28)

మంత్రము:- అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తివిచికిత్సా వా స్యాత్। యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మ కామా స్యుః। యథా తే తత్ర వర్తేరన్। తథా తత్ర వర్తేథాః। అథాభ్యాఖ్యాతేషు। యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామా స్యుః। తథా తే తేషు వర్తేరన్। తథా తేషు వర్తేథాః। ఏష ఆదేశః। ఏష ఉపదేశః। ఏషా వేదోపనిషత్। ఏత దనుశాసనమ్। ఏవముపాసితవ్యమ్। ఏవము చైతదుపాస్యమ్॥

అర్థము:- అథయదితే = అటుపిమ్మట నీకొకవేళ; కర్మవిచికిత్సా = కర్తవ్యనిర్వహణమున నేమయిన శంకకల్గినచో: వా = లేక, వృత్తి విచికిత్సా=సదాచార విషయమున నేమయిన శంకకాని। వాస్యాత్= ఎప్పుడయిన కల్గినచో; అత్ర = ఆ విషయమున; యే = ఎవరైతే;

సమ్మర్శినః = ఉత్తమమగు విచారము చేయగలట్టియు: యుక్తాః = పరామర్శయందు కుశలురైనట్టియు; ఆయుక్తాః=కర్మాదిసదాచారము లందు పరిపూరులగు నట్టియు; అలూక్షాః=స్నిగ్ధస్వభావము కలట్టియు; ధర్మకామాః = ధర్మాభిలాషులైనట్టియు; బ్రాహ్మణాః స్యుః = బ్రాహ్మణులు కలరో; తే = వారు; యథాతత్ర వర్తేరన్ = ఆయా కర్మాచరణములందు ఏవిధముగ ప్రవర్తించెదరో; తథాతత్రవర్తేథా= నీవును అట్లే ప్రవర్తింపవలయును; అథాభ్యాఖ్యాతేషు=దుస్స్వభావుడగు మానవునితో వ్యవహరింప వలసిన విషయములలో సందేహము కలిగి నచో అప్పుడుకూడ; యేతత్ర సమ్మర్శినః - యుక్తాః - ఆయుక్తాః - అలూక్షాః - ధర్మ కామాః - బ్రాహ్మణాఃస్యుః; తేయథాతేషువర్తేరన్; తథాతేషువర్తేథాః (అర్థముపైన వివరింపఁబడినది) ఏష ఆదేశః = ఇది శాస్త్రాజ్ఞ; ఏషఉపదేశః = ఇది గురుజనులు తమ శిష్యులకు, పుత్రులకు నిచ్చు నుపదేశము; ఏషావేదోపనిషత్ = ఇదియే వేద రహస్యము; చ ఏ తదనుశాసనమ్ = మఱియు నిదియే పరంపరాగత మగు శిక్షణము, ఏవం = ఈవిధముగ; ఉపాసితవ్యమ్ = నీవు అను ష్ఠింపవలసియున్నది; ఏవమ్ ఉచ ఏతత్ ఉపాస్యమ్=ఈ విధముగానే ఇది యనుష్ఠింపవలసియున్నది.

వ్యాఖ్య:- గృహస్థాశ్రమ ధర్మము నింత శ్రద్ధతో నాచరించు చున్నను, ఒక్కొక్క విషయమున కర్తవ్యతా విమూఢుడైన సమయ మున మాత్రము ఉత్తమ పురుషులను, సదాచార పరాయణులను తలంచి, ఆట్టి స్థితిలో వారేమి చేయుదురో తానును అట్లే చేయఁదగి యున్నది. ఎందువలన? "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః" మనకు వారు మార్గదర్శకులు కాబట్టి. అటులనే లోకమున నొకొక్క సారి దుష్టునితో వ్యవహరింపవలసి వచ్చినప్పుడును, శ్రేష్ఠ జనుల మార్గమే అనుసరింపఁదగినది. ఇది శాస్త్రము. ఇట్లాజ్ఞాపించుచున్నది.

ఇదియే గురువు లేక తల్లిదండ్రులు తమ శిష్యులు, లేక సంతానము నకు పరంపరాగతముగ గావించు నుపదేశము. ఈ ప్రకారముగనే కర్తవ్య సదాచారపాలన మవశ్యాచరణీయమైయున్నది.

## ద్వాదశానువాకము
## ( శాన్తిపాఠము )

మంత్రము:- శం నో మిత్రః శం వరుణః। శం నో భవత్వర్యమా। శం న ఇన్ద్రో బృహస్పతిః। శం నో విష్ణురురుక్రమః। నమో బ్రహ్మణే। నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వాదిషమ్। ఋత మవాదిషమ్। సత్యమవాదిషమ్। తన్మామావీత్। తద్వక్తారమావీత్। ఆవీన్మామ్। ఆవీద్వక్తారమ్। ఓం శాన్తిః శాన్తిః శాన్తిః॥

అర్థము:- (ఇందు 'త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి' వఱకు ప్రథమాను వాకమును దర్శించునది). త్వామేవ=నిన్నే; ప్రత్యక్షం బ్రహ్మ = ప్రత్యక్ష రూపమగు బ్రహ్మముగా; అవాదిషమ్ = చెప్పితిని; ఋతమ వాదిషం = ఋత నామముతో పిలిచితివి. (నీవు ఋతమునకధిష్ఠాతవు కనుక); సత్యమవాదిషమ్=సత్యనామముతో పిలిచితిని; తన్మామావీత్ = సర్వశక్తిమంతుడగు నా పరమేశ్వరుడు నన్ను రక్షించెను; తద్వక్తారమావీత్ = అతడాచార్యుని రక్షించెను; ఆవీన్మామ్=నన్ను రక్షించెను; ఆవీద్వక్తారమ్ = ఆచార్యుని రక్షించెను; ఓం శాన్తిః శాన్తిః శాన్తిః = ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపత్రయము సర్వథా ఉపశమించుగాక!

వ్యాఖ్య:- శిక్షావల్లి యందలి ఈ అంతిమానువాకమున భిన్న భిన్న శక్తుల అధిష్ఠాతయగు పరమేశ్వరుని స్తుతించి పిమ్మట కృతజ్ఞత ప్రకటింపఁబడినది. ఆధిభౌతిక ఆధిదైవిక ఆధ్యాత్మిక శక్తుల రూపము ఁను వాని యందలి యధిష్ఠాతలగు మిత్రవరుణాది దేవతల రూపము ననుగల సర్వాంతరయామి యగు పరమేశ్వరుఁడన్ని విధముల మనకు కల్యాణమయుఁడగునుగాక! అతడు మనకెట్టి విఘ్నములను కల్గింపకుండు గాక! ఈ విధముగ పరమాత్మ కొఱకు శాంతి ప్రార్థన చేసి సమస్త ప్రాణులందు వ్యాపించిన పరమేశ్వరుని వాయు నామమున స్తుతించుట జరిగినది. అనువాకాంతమున 'తన్మామావీత్। తద్వక్తారమావీత్। ఆవీన్మామ్। ఆవీద్వక్తారమ్।' అని ద్విరుక్తి - శిక్షావల్లి పూర్తియైనదని సూచించుచున్నది.

ఊఊఊఊఊఊఊఊఊ

# బ్రహ్మానందవల్లి

## ప్రథమానువాకము

## (బ్రహ్మవేత్త - అన్నమయ పురుషుఁడు)

మంత్రము:- బ్రహ్మవిదాప్నోతి పరమ్। తదేషాభ్యుక్తా। సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ। యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి॥

అర్థము:- బ్రహ్మవిత్=బ్రహ్మజ్ఞాని; పరమ్= పర బ్రహ్మమును; ఆప్నోతి =పొందును; తత్=ఈ భావమును వ్యక్తపఱచుటకు; ఏషా =ఈశ్రుతి; అభ్యుక్తా= చెప్పఁబడినది; బ్రహ్మ = బ్రహ్మము; సత్యం =సత్య స్వరూపము; జ్ఞానం=జ్ఞాన స్వరూపమును; అనన్తమ్ = అనంతమునై యున్నాడు; యః=ఏమానవుఁడు; పరమేవ్యోమన్ = పరమ విశుద్ధమైన ఆకాశమున నున్నవాఁడయ్యు; గుహాయాం = ప్రాణుల యొక్క హృదయ రూపమయిన గుహాయందు; నిహితం = దాగి యున్న ఆతనిని; వేద=తెలియునో; సః=ఆ మానవుఁడు; విపశ్చితా = అవిజ్ఞానస్వరూపుఁడగు; బ్రహ్మణాసహ=బ్రహ్మముతోకూడ; సర్వాన్, కామాన్ అశ్నుతే=సమస్త భోగములను అనుభవించుచున్నాఁడు.

వ్యాఖ్య:- బ్రహ్మజ్ఞాని పరమాత్మను పొందు విధాన మిచట వర్ణింపఁ బడుచున్నది. పరబ్రహ్మ పరమాత్మ స్వరూపుడు. అతఁడు నిత్యము. ఏకాలము నందును వాని యభావము లేదు. అతఁడాకాశమున నున్న వాఁడయ్యు, నందరి హృదయ గుహాలయందును డాగియున్నాఁడు.

అతనిని తెలిసినవాఁడు సమస్త సౌఖ్యములనందఁగలఁడు. అతఁడింద్రియముల ద్వారా బాహ్య విషయములను సేవించు చున్నప్పటికిని, నిజమునకు సర్వదా అతఁడు పరమాత్మయందే లీనమగుచున్నాఁడు. అతఁడు పరమాత్మ నుండి యొక్క క్షణకాలమైనను వేరుకాలేఁడు.

2. మంత్రము:- తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః ఆకాశా ద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోఽన్నమ్। అన్నాత్పురుషః। స వా ఏష పురుషోఽన్నరసమయః, తస్యేదమేవ శిరః। అయం దక్షిణః పక్షః। అయముత్తరః పక్షః। అయమాత్మా। ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి॥

అర్థము:- వై=నిశ్చయముగ; తస్మాత్=సర్వప్రసిద్ధుఁడయిన; ఏతస్మాత్ ఆత్మనః = ఈ పరమాత్మ నుండి మొట్టమొదట; ఆకాశః సంభూతః = ఆకాశ తత్త్వముత్పన్నమయినది; ఆకాశాత్ వాయుః = ఆకాశము నుండి వాయువు; వాయోరగ్నిః = వాయువు నుండి అగ్ని; అగ్నేరాపః = అగ్ని నుండి జలము; అద్భ్యః పృథివీ = జలమునుండి పృథివీతత్త్వము; పృథివ్యాఓషధయః = భూమినుండి సమస్త ఓషధులు; ఓషధీభ్యః అన్నమ్ = ఓషధులనుండి అన్నము ఉత్పన్నములయిన వి; అన్నాత్ పురుషః = అట్టి అన్నము నుండి పురుషుఁడుద్భవించుచున్నాఁడు; స ఏష పురుషఃవై అన్నరసమయః = అట్టి ఈ మానవ శరీరము నిశ్చయముగా అన్నరసమయమే; తస్య = ఆ శరీరమునకు; ఇదమేవ శిరః = ఇదియే శిరస్సు; (ఇచట మానవ శరీర ధారియగు పురుషునకు పక్షిగా రూపకల్పనఁ గావింపఁబడినది) అయం దక్షిణః పక్షః = ఈ కుడిబుజము దక్షిణపక్షము; అయముత్తరః పక్షః = ఈ ఎడమబుజముత్తర పక్షము; అయమాత్మా = ఈమధ్య భాగము ఆత్మ (మధ్యం హ్యేషా మంగానామాత్మా- అను శ్రుతి వచనాను సారము

శరీర మధ్య భాగము సర్వాంగములకు నాత్మయగుచున్నది.) ఇదమ్ పుచ్ఛమ్ ప్రతిష్ఠా = ఈ పాదద్వయము పుచ్ఛమగుచున్నది. తదపి ఏషః శ్లోకోభవతి = ఈ అన్నమహిమకు సంబంధించిన విషయము మఱియు ముందటి మంత్రములందు వివరింపఁబడును.

వ్యాఖ్య:- అట్టివానికి ఆధారభూతమయిన ఆ పరమాత్మను తెలిసికొనుట యెట్లు? అయ్యది ఈ ప్రకరణమున వివరింపఁబడును. అతఁడు మనుష్యుని హృదయ గుహయందు దాగియున్నాఁడనికదా! కావున మానవ శరీరోత్పత్తి క్రమమును తెలిసికొనవలెను. ఇది యిచ్చట ఖగాంగము నందు రూపకల్పనము చేయఁబడినది.

## అన్నమయపురుషుఁడు

పరమాత్మయొక్క ఆత్మనుండి ఆకాశము, దాని నుండి వాయువు, దాని నుండి అగ్ని, దాని నుండి నీరు, దాని నుండి పృథివి, దానినుండి ఓషధులు, దాని నుండి అన్నము, దాని నుండి పురుషుఁడు (అన్న రసమయుఁడు) ఉద్భవించుట గ్రహింపఁదగినది




# ద్వితీయానువాకము
# (ప్రాణమయ పురుషుఁడు)

1. మంత్రము:- అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే। యాః కాశ్చ పృథివీగ్ంశ్రితాః। అథో అన్నేనైవ జీవన్తి। అథైనదపి యన్త్యన్తతః। అన్న

గ్ంహి భూతానాం జ్యేష్ఠమ్। తస్మాత్సర్వౌషధముచ్యతే। సర్వం వై తేఽన్న మాప్నువన్తి యేఽన్నం బ్రహ్మోపాసతే। అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్। తస్మాత్సర్వౌషధముచ్యతే। అన్నాద్భూతాని జాయన్తే। జాతాన్యన్నేన వర్ధన్తే। అద్యతేఽత్తి చ భూతాని। తస్మా దన్నం తదుచ్యత ఇతి। ( Ref - భృగు-2 )

అర్థము:- పృథివీం శ్రితాః = భూలోకము నాశ్రయించియున్న; యాః కాశ్చ ప్రజాః = ఏ ప్రాణులైతే ఉన్నవో అవియన్నియు; అన్నాత్ వై = అన్నము వలననే; ప్రజాయన్తే = ఉత్పన్నములగు చున్నవి; అథ = తిరిగి; అన్నేనైవజీవన్తి = అన్నము వలననే జీవించుచున్నవి; అన్తతః = అంతమున; ఏనదపి = ఈ అన్నము నందే; యన్తి = విలీనములగుచున్నవి; అన్నమ్ హి = అన్నమే; భూతానాం = ఈ సమస్త భూతములకు; జ్యేష్ఠం = శ్రేష్ఠమయినది; తస్మాత్ = అందుచే ఈ అన్నము; సర్వౌషధముచ్యతే = ఉత్కృష్టమగునౌషధముగ చెప్పబడుచున్నది; యే = ఏసాధకులు; అన్నం = ఈ అన్నమును; బ్రహ్మఉపాసతే = బ్రహ్మ మనుభావముతో నుపాసించుచున్నరో; తేవై సర్వం అన్నం ఆప్నువన్తి = వారేనిశ్చయముగా సమస్తాన్నములను పొందుచున్నారు; హి = ఎందుచేతననగా; అన్నం హి భూతానాం జ్యేష్ఠమ్ = అన్నము సర్వ భూతములకు శ్రేష్ఠమయినది; తస్మాత్ సర్వౌషధముచ్యతే = అందుచే అన్నమే గొప్ప ఔషధము. అన్నాత్ భూతానిజాయన్తే=అన్నము వలననే సర్వప్రాణులు జనించుచున్నవి; జాతాని అన్నేనవర్ధన్తే = పుట్టిన జీవులు అన్నము వలననే వృద్ధిపొందుచున్నవి; అద్యతే=ఇది ప్రజలచే భక్షింపబడు చున్నది. చ = ఆ విధముగానే; భూతానిఅత్తి =భూతములను భక్షించుచున్నది

కూడ; తస్మాత్ తత్ = అందు చేతనే అవి; అన్నమ్ ఇతి ఉచ్యతే = అన్నము అని పిలువఁబడుచున్నది.

వ్యాఖ్య:- ఈవల్లి యందలి ప్రథమాను వాకమున పురుషుఁడు అన్నరసమయుఁడని చెప్పఁబడినది. అతఁడన్నము నుండియే ఉద్భవించుచున్నాఁడని గ్రహించితిమి. పరమాత్మ అతని హృదయము నందధిష్ఠించి యున్నాఁడని చెప్పఁబడినది. కావున పరమేశ్వరుని తెలిసికొనుటకు పురుషుని గూర్చి; ఆ పురుషుని తెలిసికొనుటకు అతనిని సృష్టించుచున్న అన్నమును గూర్చి తెలిసి కొనవలసి యున్నది. అట్టి అన్నమహిమయే ఈ యనువాకమున వివరింపఁబడుచున్నది. ఇందలివిషయము - అన్నమే సృష్టిస్థితిలయ ములకు మూల కారణమగుచున్నది. అదియే సృష్టించి పోషించుచు న్నవి. అదియే ఈభూతములను తనలో విలీనము చేసికొనుచున్నది. అందుచేతనే "అద్యతే అత్తిచ భూతాని తస్మాదన్నంతదుచ్యతే" అని దానివ్యుత్పత్తి వివరింపఁబడియున్నది. అదియే సర్వౌషధముగ నెంచ బడుచున్నది. ఇది ప్రాణులలోని క్షుత్సంతాపమును దూరము చేయుచున్నది. అందుచేతనే ప్రాణులు అన్నమే సర్వోత్కృష్టమని, అది పరబ్రహ్మస్వరూపమని భావించి అట్లే ఉపాసించుచున్నవి. భృగుమహర్షి తపస్సుగావించి అన్నమేబ్రహ్మమని తెలిసికొనెను. ఈ విషయమును రాబోవు భృగువల్లి ద్వితీయానువాకమున మరింత వివరముగఁదెలిసికొనవచ్చును.

మంత్రము:- తస్మాద్వా ఏతస్మాదన్నరసమయా దన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః। తేనైష పూర్ణః। స వా ఏష పురుషవిధ ఏవ। తస్య పురుష విధతామన్వయం పురుషవిధః। తస్య ప్రాణ ఏవ శిరః। వ్యానో దక్షిణః పక్షః। అపాన ఉత్తరః పక్షః। ఆకాశ ఆత్మా। పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి॥

అర్థము:- వై = నిశ్చయముగా; తస్మాత్ ఏతస్మాత్ అన్నర సమయాత్ = ఆయీ అన్నరసమయ మనుష్య శరీరము కంటె; అన్యః = భిన్నుఁడైనట్టియు; అన్తరః = ఆ శరీరాంతస్థితుడైనట్టియు; ప్రాణమయః ఆత్మా = ప్రాణమయుడగు పురుషుఁడొకఁడు; తేన = ఆ ప్రాణమయ పురుషునిచే; ఏషః = ఈ అన్నరసమయ పురుషుడు; పూర్ణః = వ్యాప్తి చెందియున్నాఁడు; సఏషః = ఆప్రాణమయాత్మ; వై = నిశ్చయముగా; పురుషవిధః ఏవ = పురుషునియొక్క (మానవ) ఆకారముననే ఉండును; తస్య = ఆ అన్నరసమయాత్మ యొక్క, పురుష విధతాం = పురుషతుల్యాకృతిలో; అను = వ్యాప్తి చెందుట చేతనే; అయమ్ = ఈ ప్రాణమయాత్మ; పురుషవిధః = పురుషాకార మున నున్నది, తస్య = ఆ ప్రాణమయాత్మకు; ప్రాణ ఏవశిరః = ప్రాణవాయువు శిరస్సు, వ్యానః దక్షిణః పక్షః = వ్యాన వాయువు (కుడి) దక్షిణ పక్షము, అపాన ఉత్తరః పక్షః = అపాన వాయువు (ఎడమ) ఉత్తర పక్షము; ఆకాశ ఆత్మా = ఆకాశము ఈశరీరమునకు మధ్యభాగము; తదపి = ఈ ప్రాణమహిమను గూర్చి, ఏషః = ముందు చెప్పఁ బోవునది, శ్లోకః భవతి = వివరించు మంత్రమగు చున్నది.

వ్యాఖ్య:- ఈ ద్వితీయానువాక ద్వితీయాంశమున ప్రాణమయ శరీరము యొక్క రూపము వర్ణింపఁబడినది. ప్రథమానువాకమున అన్నమయపురుషుఁడు, ద్వితీయానువాక ప్రథమాంశమున అన్నమ యాత్మ - వివరింపఁబడిన అంశములు. దీనిస్థితికి ఆధారభూత మయిన ప్రాణమయాత్మ నిటుఁదెలిసికొనవచ్చును. అన్నమయ శరీ రము స్థూలము, అందంతర్గతముగ నిమిడియుండి దాని స్థితికి; వ్యాప్తికి హేతుభూతమై ప్రాణమయాత్మ ఒప్పుచున్నది. అన్నమయ శరీరమునకు పురుషాకారతకలదు; కాన ప్రాణమయమునకు కూడ

పురుషాకారతనే గ్రహింపఁదగును. ఈ ప్రాణమయ శరీరమునకు కూడ పక్షిరూప కల్పనానుసారము ప్రాణమే శిరస్సు. అయిదు వాయువులలోను ప్రాణవాయువే ముఖ్యము కనుక అదియే శిరస్సు. సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్మనికదా! వ్యానము దక్షిణపక్షము. అపాన ముత్తర పక్షము. ఆకాశమాత్మ. ఆకాశమందంతటను వ్యాపించిన వాయువువలె సర్వ శరీర వ్యాపియగు వాయువు ఆత్మయగుచున్నది. సమస్త శరీరమునకు సమాన భావమును రసమును కల్గించుచు సమస్త ప్రాణమయ శరీరమునకు పుష్టిని కల్గించునదియే వాయువుకదా! దీని స్థానము శరీర మధ్యభాగము. ఈ విధముగానిది బాహ్యాకాశముతో సంబంధము కల్గియున్నది. ఈ విషయము ప్రశ్నోపనిషత్తులోని 3వ ప్రశ్నలోని 5, 8 మంత్రములలో కూడ వివరింపఁబడినది.

## ప్రాణమయ పురుషుడు (ప్రశ్నోపనిషద్విషయము)




3 - 5 పాయూపస్థేఽపానం, చక్షుఃశ్రోత్రే ముఖనాసికాభ్యాం ప్రాణః, స్వయంప్రాతిష్ఠతే మధ్యేతు సమానః। ఏష హ్యేతద్ధుత మన్నం సమం నయతి తస్మాదేతాః సప్తార్చిషో భవన్తి॥

3 - 8 ఆదిత్యోహవై బాహ్యః ప్రాణ ఉదయత్యేష హ్యేనం చాక్షు ప్రాణమను గృహ్ణానః। పృథివ్యాం యా దేవతా సైషా పురుషస్యాపాన మవష్టభ్యాన్తరా యదాకాశః స సమానో వాయుర్వ్యానః.

# తృతీయానువాకము
## ( మనోమయ పురుషుఁడు )



**మంత్రము:-** ప్రాణం దేవా అను ప్రాణన్తి। మనుష్యాః పశవశ్చ యే। ప్రాణో హి భూతానామాయుః। తస్మాత్ సర్వాయుషముచ్యతే। సర్వమేవ త ఆయుర్యన్తి యే ప్రాణం బ్రహ్మోపాసతే। ప్రాణో హి భూతానామాయుః। తస్మాత్ సర్వాయుషముచ్యత ఇతి। తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య॥

**అర్థము:-** యే దేవాః మనుష్యాః పశవశ్చ తే = దేవతలు మానవులు పశువులు మొదలగు ప్రాణులు; ప్రాణం అను = ప్రాణముననుసరించి, ప్రాణన్తి = జీవించుచున్నవి; హి = ఎందువల్లననగా; ప్రాణః భూతానామాయుః = ప్రాణమే ఈ సమస్త భూతములకు నాయువు; తస్మాత్ సర్వాయుష ముచ్యతే = అందుచేతనే ఈ ప్రాణము సమస్తమునకు ఆయువని చెప్పఁబడుచున్నది; ఇతి = అని తెలిసికొని; యే ప్రాణం బ్రహ్మ ఉపాసతే = ఎవరు ప్రాణముయొక్క బ్రహ్మస్వరూపమయిన ఉపాసనము గావింతురో, తే = వారు; సర్వమేవ ఆయుః యన్తి = నిస్సందేహముగ పరిపూర్ణమయిన ఆయుర్దాయమును పొందుచున్నారు; ఏషఏవ శారీరః = ఈ శరీరమునందుండునట్టి ఈ ప్రాణమే; యః పూర్వస్య = ఆ అన్నరసమయ శరీరమునకు; ఆత్మా = అంతరాత్మయై ఒప్పుచున్నది.

**వ్యాఖ్య:-** ఈ యనువాక ప్రథమాంశమున ప్రాణ మహిమను వర్ణించు శ్రుతి ఉల్లేఖింపఁబడినది. ప్రాణమయ శరీరమునందలి అంతర్యామి పరమేశ్వరుఁడు దీనిలక్ష్యము. మర్త్య పశుదేవతాది శరీరధారులందరు ప్రాణము వలననే చైతన్యవంతులగు చున్నారు. ప్రాణము

లేనిచో శరీరమే లేదు. కావున అన్ని ప్రాణులకు ప్రాణమే ఆయువు. అందుచేతనే ఈ ప్రాణము సర్వాయుషమని చెప్పఁబడినది. ఇట్టి ఈ విషయమును గ్రహించి, ఈ ప్రాణమును బ్రహ్మముగా భావించి ఉపాసన చేయువారు పూర్ణాయుర్దాయమును పొందఁగల్గుదురు. ఈ ప్రాణతత్త్వము నర్థము చేసికొని వ్యవహరించు మానవుడు దైవసమానుఁడని ప్రశ్నోపనిషత్తులోని 3వ ప్రశ్న -11వ మంత్రమున చెప్పఁబడియున్నది. సర్వాత్మయగునే పరమేశ్వరుఁడు అన్నరసమయ స్థూల శరీర ధారియగు పురుషునకంతరాత్మయైనాడో, అతఁడే ప్రాణమయ పురుష శరీరాంతర్వర్తియునగుచున్నాఁడు.

2. మంత్రము:- తస్మాద్వా ఏతస్మాత్ ప్రాణమయాదన్యోఽన్తర ఆత్మా మనోమయః। తేనైష పూర్ణః। స వా ఏష పురుషవిధ ఏవ। తస్య పురుష విధతామన్వయం పురుషవిధః। తస్య యజురేవ శిరః। ఋక్ దక్షిణః పక్షః। సామోత్తరః పక్షః। ఆదేశ ఆత్మా। అథర్వాఙ్గిరసః పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి।

అర్థము: వై = ఇది నిశ్చయము; తస్మాత్ ప్రాణమయాత్ = ఆ ఈ ప్రాణమయ పురుషుని కంటె; అన్యః = భిన్నుఁడై; అన్తరః =ఆ ప్రాణమయ పురుషుని లోపల నుండువాఁడు: మనోమయః ఆత్మా =మనోమయుడగుపురుషుఁడొకడున్నాడు, (ఈ సందర్భమున శరీరము, పురుషుఁడు, ఆత్మమన్నగు పదములు భిన్నములు కావనియు; ఏకార్థకము లేననియు గ్రహించుట యుక్తము) తేన = ఆ మనోమయాత్మచే; ఏషః = ఈ ప్రాణమయ శరీరము; పూర్ణః = వ్యాప్తి

చెందియున్నది; సఏషః = ఆమనోమయాత్మ; వై = నిశ్చయముగా పురుషవిధః = పురుషాకారము కలవాఁడే; తస్యపురుషవిధతాం అను= ఆపురుషతుల్యాకృతిలో వ్యాప్తి చెందుటచే; అయం=ఈమనోమయాత్మ కూడ; పురుషవిధః=పురుషాకారమునకు చెందినదే; తస్య = అమనో మయాత్మకు; యజుఃఏవ=యజుర్వేదమే, శిరః=శిరస్సు; ఋగ్దక్షిణః పక్షః=ఋగ్వేదము దక్షిణపక్షము; సామఉత్తరః పక్షః=సామ వేదము ఉత్తర (ఎడమ) పక్షము; ఆదేశః = ఆదేశము (అనగా విధివాక్యము) ఆత్మా = శరీర మధ్యభాగము; అథర్వాఙ్గిరసః = అథర్వ అంగిర ఋషిదర్శితమయిన అథర్వవేదమే; పుచ్ఛమ్ = పుచ్ఛము; (అనగా అడుగే) ప్రతిష్ఠా = ఆధారము; తదప్యేషః శ్లోకోభవతి = ఈ ప్రాణమయాత్మ రాబోవు మంత్రమునను వివరింపఁబడుచున్నది.

వ్యాఖ్య:- ఈ ద్వితీయాంశమున మనోమయాత్మ వివరింపఁబడినది, ఈ మనోమయ పురుషుఁడు ఇంతకుముందు చెప్పఁబడిన ప్రాణమయ పురుషుని కంటె భిన్నుఁడు; మఱియు తదన్తర్వర్తియై శరీరమున సర్వత్ర వ్యాపించియున్నాఁడు. ఈమనోమయ శరీరమునకు యజు ర్వేదము శిరస్సు, యాజ్ఞాదులలో యజుర్వేదమునకే ప్రాధాన్యము. "స్వాహా" శబ్దముతో కూడిన వాక్యము లేక మంత్రమే యజుస్సనఁ బడును. యజుర్వేద మంత్రముల మూలముననే అగ్నికి హవిస్సు అర్పింప బడుచున్నది. ఈ మంత్రోచ్చారణమునకు సంకల్పము మనస్సునందు జనించుచున్నది. ఇట్లు మనోమయాత్మకు వేదమంత్ర ములకు ఘనిష్ఠమయిన సంబంధము కలదు. అందుచేతనే వేదములకు మనోమయాత్మాంగములందు స్థానము కల్పింపఁబడినది. మనోమయ పురుషునకు ఋక్ సామములు రెండును దక్షిణవామపక్షములు. ఆదే శము వేదాంతర్గతమైనట్టిది కాబట్టి మనోమయ పురుషుని అంగముల

మధ్యభాగమగు ఆత్మస్థానమునది పొందియున్నది. అథర్వవేదమున శాన్తిక పౌష్టికాది కర్మలను సాధించు మంత్రములున్నవి. అవియే ఆధారమునకు కారణములగుచున్నవి. అందుచే నథర్వవేదము పుచ్ఛముగా చెప్పఁబడుచున్నది. ఇట్లు మనోమయ పురుషునకు ఈ వేదములతో నిత్యసంబంధము కలదని తెలియ వలయును.

## (మనోమయ పురుషుఁడు)




## చతుర్థానువాకము

## ( విజ్ఞానమయ పురుషుఁడు )

1. మంత్రము:- యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహా, ఆనందం బ్రహ్మణో విద్వాన్। న బిభేతి కదాచనేతి। తస్యైష శరీర ఆత్మా యః పూర్వస్య। ( Ref బ్రహ్మ 9-1 )

అర్థము:- యతః = ఏచట నుండి; మనసా సహా = మనస్సుతో; వాచః = వాగాదింద్రియములు; అప్రాప్య = వానిని పొందకయే;

నివర్తన్తే = మరలు చున్నవో; బ్రహ్మణః = ఆ బ్రహ్మయొక్క; ఆనందం = ఆనందమును; విద్వాన్ = తెలిసి కొన్న పురుషుఁడు; కదాచన = ఎప్పటికిని; నబిభేతి = భయము చెందఁడు; ఇతి అను నది దీని భావము; తస్యైషఏవ శరీర ఆత్మాయఃపూర్వస్య = తొంటి వలెనే ప్రాణమయ శరీరాన్తర్వర్తియగు మనోమయ శరీరమునకు కూడ పరమాత్మయే ఆత్మ.

2. మంత్రము: తస్మాద్వా ఏతస్మాన్మనోమయాదన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయస్తేనైషః పూర్ణః। స వా ఏష పురుషవిధ ఏవ। తస్య పురుష విధతామన్వయం పురుషవిధః। తస్య శ్రద్ధైవ శిరః। ఋతం దక్షిణః పక్షః। సత్యముత్తరః పక్షః। యోగ ఆత్మా। మహః పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి।

అర్థము:- వై = నిశ్చయముగా; తస్మాత్ = ఇంతకు ముందు చెప్పఁబడిన; ఏతస్మాత్ మనోమయాత్ = మనోమయ పురుషుని కంటె; అన్యః = ఇతరుడును; అన్తరః = ఆమనోమయ పురుషాన్తర్వర్తియునైన; ఆత్మా = ఆత్మ; విజ్ఞానమయః = విజ్ఞానమయ పురుషుఁడున్నాఁడు; వై = నిశ్చయముగా; పురుష విధ ఏవః పురుషాకారము కలవాఁడే; తస్యపురుష విధతాం అను = ఆ పురుషతుల్యాకృతిలో వ్యాప్తి పొందుటచే; అయం = ఈ మనోమయాత్మ కూడ; పురుషవిధః = పురుషాకారమునకు చెందినదే; తస్య = ఆవిజ్ఞానమయ పురుషునకు; శ్రద్ధా ఏవ శిరః = శ్రద్ధయే శిరస్సు; ఋతం దక్షిణః పక్షః = సదాచారపాలనము దక్షిణ పక్షము; సత్యముత్తరః పక్షః = సత్యము ఉత్తర పక్షము; ( సత్యభాషణము ) యోగ ఆత్మా = యోగము ఆత్మయగుచున్నది; మహః పుచ్ఛం ప్రతిష్ఠా = 'మహః' అను పేరుతో ప్రసిద్ధుఁడైన పరమాత్మయే పుచ్ఛము (ఆధారము); తదప్యేషః శ్లోకోభవతి = ఈ విజ్ఞానమయాత్మ రాబోవు మంత్రమునను వివరింపఁబడుచున్నది.

వ్యాఖ్య:- ఈ అను వాక పూర్వాంశమున విద్వాంసుని మహిమతో పాటు మనోమయ పురుషుని మహిమ కూడ ప్రకటింపబడినది. వాగాదీంద్రియములు కూడ ఏ పరబ్రహ్మమును చేరలేకపోవుచున్నవో, అట్టి బ్రహ్మానందమును పొందు విద్వాంసుఁడెన్నడును భయపడఁడు; అట్టి మనోమయ పురుషుని లోపల నున్న వాడును, పురుషాకారము కలవాఁడు నైన వాఁడు విజ్ఞానమయ పురుషుఁడు. ఆ విజ్ఞానమయ శరీరము మనోమయ శరీరము లోపల నున్నదనగా, మనోమయ శరీర మందంతటను వ్యాప్తి చెందియున్నది. ఈ విజ్ఞానమయ పురుషుఁడు బుద్ధి రూప గుహ యందు నివసించుచున్నవాఁడు. ఇట్లే విజ్ఞానమయ పురుషుఁడు శరీర మందంతటను వ్యాపించి యున్నాఁడు. ఈ జీవాత్మ శరీర క్షేత్రమున సర్వత్ర స్థితిని పొంది యున్నాఁడని గీత (13-32) కూడ బోధించుచున్నది. ఈ విజ్ఞానమయ శరీరమునకు శ్రద్ధయే శిరస్సు. బుద్ధి యొక్క నిశ్చితమయిన విశ్వాస రూప వృత్తియే శ్రద్ధ. పరమాత్మ ప్రాప్తికి అన్నిటి కన్న శ్రద్ధయే ముఖ్యమైయుండుటయే అది శిరః స్థానమును పొందియున్నది. దృఢ విశ్వాసమే ఉన్నతికి కారణమగును కదా! ధ్యానము ద్వారా పరమాత్మను చేరి అతనిఁగలసియుండుట విజ్ఞానమయ శరీరమునకు ఆత్మ. అదియే యోగము. శిక్షావల్లి యందు వ్యాహృతి చతుష్టయమున చెప్పబడిన 'మహః' అనునదియే బ్రహ్మము. అట్టి బ్రహ్మమే ఈ విజ్ఞానమయ శరీరమునకు ఆధారము.

## విజ్ఞానమయ పురుషుడు




## పంచమానువాకము

## (ఆనందమయ పురుషుడు)



1.మంత్రము; విజ్ఞానం యజ్ఞం తనుతే। కర్మాణి తనుతేఽపి చ। విజ్ఞానం దేవాః సర్వే బ్రహ్మ జ్యేష్ఠముపాసతే। విజ్ఞానం బ్రహ్మ చేద్వేద। తస్మాచ్చేన్న ప్రమాద్యతి। శరీరే పాప్మనో హిత్వా। సర్వాన్ కామాన్ సమశ్నుత ఇతి। తస్యైష ఏవ శరీర ఆత్మా యః పూర్వస్య॥

అర్థము:- విజ్ఞానమ్ = విజ్ఞానమే; యజ్ఞంతనుతే = యజ్ఞములను విస్తరించుచున్నది; కర్మాణి తనుతేఽపిచ = కర్మలను కూడ విస్తరించుచున్నది, సర్వేదేవాః = ఇంద్రియ రూప సమస్త దేవతలును, జ్యేష్ఠం = సర్వజ్యేష్ఠుడైన; బ్రహ్మ = బ్రహ్మస్వరూపముగ; విజ్ఞానం ఉపాసతే=విజ్ఞానము నుపాసించుచున్నారు; చేత్=ఎవడయిన; విజ్ఞానమ్ = విజ్ఞానమును; బ్రహ్మవేదచేత్ = బ్రహ్మముగా తెలిసికొన్నచో; తస్మాత్ = దానివలన; నప్రమాద్యతి = ప్రమాదపడడు; (నిరంతర

చింతనము గావించుచునే యుండును). పాప్మనః = పాపసముదాయ మును; శరీరే = శరీరము నుండి; హిత్వా = విడచి పుచ్చి; సర్వాన్ కామాన్ = సమస్త భోగములను; సమశ్నుతే ఇతి = అనుభవించునని చెప్పఁబడినది; తస్య = ఆ విజ్ఞానమయ పురుషునకు; ఏష ఏవ = ఈ పరమాత్మయే; శరీరః = శరీరాన్తర్వర్తియగు; ఆత్మా = ఆత్మయై ఉన్నాడు; యః పూర్వస్య = పూర్వ విషయము నకు వలెనే.

వాఖ్య:- ఈమంత్రమున విజ్ఞానాత్మ యొక్క మహిమ, దానిని బ్రహ్మ స్వరూపముగ భావించి ఉపాసించుట వలన గలుగు ఫలితములను గూర్చి చెప్పఁబడినది. విజ్ఞానమ్ = విజ్ఞానముతో కూడిన తద్రూప మయిన జీవాత్మయే అని గ్రహింప నగును. అట్టి జీవాత్మయే శుభ కర్మ రూపములగు యజ్ఞములను అన్యాన్య లౌకిక కర్మలను విస్తరించు చున్నది. ఇంద్రియ రూప సర్వ దేవతలు సర్వ శ్రేష్ఠ మగు బ్రహ్మ స్వరూపమున నున్న విజ్ఞానమయ జీవాత్మను సేవించుట జరుగు చున్నది. అందుచే విజ్ఞాన స్వరూపమగు నాత్మను బ్రహ్మము గా తెలియు నట్టి సాధకుఁడు సమస్త సౌఖ్యములను సుఖములను పొందఁగలడు. బహు జన్మ సమంచితమగు పాప సముదాయమును శరీరము నుండి గెంటివైచి, సమస్త దివ్య భోగములను అనుభవింపఁ గలఁడు. ఈ విజ్ఞానమయ పురుషునకు కూడ అన్తర్యామి ఆ పర బ్రహ్మయగు పరమేశ్వరుఁడే.

2.మంత్రము:- తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాదన్యోఽన్తర ఆత్మా ఽఽనందమయః। తేనైషః పూర్ణః। స వా ఏష పురుషవిధ ఏవ। తస్య పురుషవిధతామన్వయం పురుషవిధః। తస్య ప్రియమేవ శిరః। మోదో దక్షిణః పక్షః। ప్రమోద ఉత్తరః పక్షః। ఆనంద ఆత్మా। బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి॥

అర్థము:- వై=నిశ్చయముగా; తస్మాత్ఏతస్మాత్ = ఇంతకుముందు చెప్పఁబడిన; విజ్ఞానమయాత్=విజ్ఞానమయ జీవాత్మకంటె; అన్యః = భిన్నుఁడును; అన్తరః=విజ్ఞానమయాన్తరస్థుఁడునైనవాఁడు; ఆనందమయ ఆత్మా = ఆనందమయ పురుషుఁడున్నాఁడు; తస్య = ఆ విజ్ఞానమయాత్మ; పురుషవిధతాంఅను = పురుషాకారమున నుండుటచే; అయమ్ = ఈ ఆనందమయ పురుషుఁడును; పురుష విధః = పురుషాకారుఁడే; తస్య = ఆ ఆనందమయాత్మకు; ప్రియమ్ = ప్రియము, శిరః = శిరస్సు (ప్రధానము); మోదః దక్షిణః పక్షః = మోదము దక్షిణ పక్షము; ప్రమోద ఉత్తరః పక్షః = ప్రమోదము ఉత్తర పక్షము, ఆనందఆత్మ = ఆనందమే ఆత్మ, (మధ్య భాగము) బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా = బ్రహ్మము పుచ్ఛము (ఆధారము), తదప్యేష శ్లోకో భవతి = ఈ విషయము తరువాతి శ్లోకమున (షష్ఠాను వాకమున) వివరింపఁబడును.

వ్యాఖ్య:- పంచమానువాక ద్వితీయాంశమున ఆనందమయ పురుషుని వర్ణనము గావింపఁబడినది. విజ్ఞానమయ శరీరమునకు లోపల నున్న వాఁడే పరబ్రహ్మమగు ఆనందమయాత్మ. బృహదారణ్యకోపనిషత్తు కూడ పరమాత్మను జీవశాసకునిగను, జీవాత్మ యొక్క అంతరాత్మగను అభివర్ణించుచున్నది. ఈ ఆనందమయ పురుషునకు ప్రియభావమే శిరస్సు. అనగా ఆనందమయ పురుషుఁడందఱకును ప్రియమైనవాఁడు. సమస్త భూతములు ఆనందమును ప్రేమించును. ప్రియత్వమే ఈ ఆనందమయాత్మ యొక్క ప్రధానాంగము. కావున నది శిరస్సు. మోదప్రమోదములు దక్షిణోత్తర పక్షములు. ఆనందము పరమాత్మ యొక్క మధ్యభాగము. అనగా ఆత్మ. అయితే మనకు ఇచ్చటొక సందేహము కలుగవలసియున్నది. భగవంతుఁడవయవ రహితుఁడు కదా! మఱి యీ కల్పన యెందులకు? దీనికి సమాధానము

బ్రహ్మసూత్రములు 3.3 నుండి 3 14 వఱకు పరిశీలించినచో మన కవగతమగుమగును. బ్రహ్మోపాసనము సుగమము గావించుటకే ఇట్లు వర్ణింపఁబడినది. ఈప్రకరణమున విజ్ఞానమయాత్మను జీవాత్మ గను, ఆనందమయాత్మను పరమాత్మగను గ్రహింపఁదగి యున్నది. ఈవిషయమును బ్రహ్మ సూత్రములు 1-1-12 నుండి 1-1-19 వఱకు యుక్తులతో శ్రుతి ప్రమాణములతో చక్కగా వివరించుచున్నవి.

## ఆనందమయ పురుషుఁడు



## పంచకోశముల పట్టిక :

| శరీరము / పురుషుడు / ఆత్మ. | శిరస్సు | దక్షిణ పక్షము | ఉత్తర పక్షము | ఆత్మ | పుచ్ఛము |
|---|---|---|---|---|---|
| 1. అన్నమయ | - | - | - | - | - |
| 2. ప్రాణమయ | ప్రాణ వాయువు | వ్యాన వాయువు | అపాన వాయువు | ఆకాశము | పృథివి |
| 3. మనోమయ | యజుర్వేదము | ఋగ్వేదము | సామ వేదము | ఆదేశము | అథర్వ వేదము |
| 4. విజ్ఞానమయ | శ్రద్ధ | ఋతము | సత్యము | యోగము | మహస్సు |
| 5. ఆనందమయ | ప్రియము | మోదము | ప్రమోదము | ఆనందము | బ్రహ్మము |

## షష్ఠానువాకము

# బ్రహ్మాస్తిత్వ ప్రతిపాదనము – సందేహము

1. మంత్రము:- అసన్నేవ స భవతి। అసద్బ్రహ్మేతి వేద చేత్।
అస్తి బ్రహ్మేతి చేద్వేద। సన్తమేనం తతో విదురితి॥

అర్థము:- చేత్ = ఒక వేళ ఎవఁడయిన; బ్రహ్మ = పరబ్రహ్మము; అసత్ ఇతి = లేనట్లు; వేద = తెలిసికొనునో; సః అసత్ ఏవ భవతి = వాఁడు లేనివాఁడే అగు చున్నాఁడు; చేత్ = ఒకచో; బ్రహ్మ అస్తీతి వేద = బ్రహ్మమున్నట్లు తెలియునో; తతః = అట్లయిన; ఏనమ్ = అవిద్వాంసుని; సన్తమ్ ఇతి = సత్పురుషుఁడని; విదుః = భావించు చున్నారు.

వ్యాఖ్య:- బ్రహ్మమునసత్తని భావించువాఁడు తానును అసత్తే అగు చున్నాఁడు అనగా స్వేచ్ఛాచారియై భ్రష్టుఁడగు చున్నాఁడు. బ్రహ్మాస్తిత్వమును గ్రహించినవాఁడు శాస్త్రములు మహాపురుషుల యందు దృఢ విశ్వాసము కల్గియుండుటచే, అట్టిజ్ఞానియగు మానవుని 'సంత్' అనగా సత్పురుషుఁడని తెలిసికొనవలెను. పరమాత్మ యొక్క తత్త్వజ్ఞానమునకు మొదటి మెట్టు బ్రహ్మాస్తిత్వము నందు విశ్వాసము!

2. మంత్రము:- తస్యైష ఏవ శరీర ఆత్మా యః పూర్వస్య।

అర్థము:- తస్య = ఆ ఆనందమయ పురుషునకును; ఏషః ఏవ = ఈ పరమాత్మయే; శరీరః = శరీరాన్తర్వర్తియగు; ఆత్మా = ఆత్మయగుచు న్నాఁడు; యః పూర్వస్య = వెనుక చెప్పఁబడిన విజ్ఞానమయాదులకు వలెనే.

వ్యాఖ్య:- ఆనందమే బ్రహ్మము, కావున ఆనందమయ శరీరమునకు అన్తర్వర్తియగు నాత్మ కూడ ఆ బ్రహ్మమే అగుచున్నాఁడు. ఎందుచేత ననగా, ఆతని బాహ్యాన్తశ్శరీరములకు భేదము లేదు; కాని ఇంతకు ముందు చెప్పఁబడిన అన్నరసమయాది శరీరములకు అన్తర్యామి పరమాత్మ, ఇచట మాత్రము తనకు తానే అన్తర్యామి యగుచున్నాఁడు. అందుచేత ఇఁక పై వర్ణ్యవస్తువు లేకుండుటచే ఈ పంచ కోశ వివరణము ఇంతటితో ముగియు చున్నది.

3. మంత్రము:- అథాతోఽను ప్రశ్నాః। ఉతా విద్వానముం లోకం ప్రేత్య కశ్చన గచ్ఛతీ౩। ఆహో విద్వానముం లోకం ప్రేత్య కశ్చిత్సమశ్నుతా౩ఉ।

అర్థము:- అథ = అనంతరము; అతః = ఇచట నుండి; అనుప్రశః = అనుమాన నివృత్తి కొఱకు వేయఁబడు ప్రశ్నలు ప్రారంభింపఁబడు చున్నవి; ఉత=ఏమి? అవిద్వాన్=బ్రహ్మమును తెలియనివాడు; కశ్చన = ఒకానొకఁడు; ప్రేత్య=మరణించి; అములోకం గచ్ఛతి = ఆ పరలోకమునకుపోవుచున్నాడా?; అహో=లేక; కశ్చిత్ విద్వాన్=ఎవడైన విద్వాంసుఁడైనవాఁడు మాత్రమే; ప్రేత్య = మరణించి, అ ముం లోకం = ఆపరలోకమును, సమశ్నుతే ఉ? = పొందు చున్నాడా? ఏది సమాధానము?

వ్యాఖ్య:- బ్రహ్మాస్తిత్వ విషయమున మానవుని మనసున కలుగు సందేహములను నివారించుటకే ప్రస్తుత విషయము ప్రారంభమగు చున్నది. మొదటి ప్రశ్న మేమనగా, బ్రహ్మమున్నచో బ్రహ్మాస్తిత్వ మును తెలియని పామరుడు చనిపోయిన పిమ్మట పరలోకమునకు పోవుచున్నాఁడా లేదా? రెండవ ప్రశ్న మేమనగా బ్రహ్మాస్తిత్వమును బాగుగా తెలిసిన విద్వాంసుఁడు కూడ తన మరణానంతరము పరలోకమును పొందుచున్నాఁడా లేదా?

4. మంత్రము:- సోఽకామయత। బహు స్యాం ప్రజాయేయేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా ఇదగ్ంసర్వమసృజత। యదిదం కిం చ। తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్। తదనుప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్। నిరుక్తం చానిరుక్తం చ। నిలయనం చా నిలయనం చ। విజ్ఞానం చావిజ్ఞానం చ। సత్యం చానృతం చ, సత్యమభవత్। యదిదం కిం చ। తత్సత్యమిత్యాచక్షతే। తదప్యేష శ్లోకో భవతి॥

అర్థము:- సః = ఆపరమేశ్వరుఁడు; అకామయత = తలంచెను (ఏమనగా) ప్రజాయేయ = అనేక నామరూపములతో ప్రకటింపఁబడుదును గాక!; బహు = అధికముగ, స్యాంఇతి = అగుదునని; సః = ఆపరమేశ్వరుఁడు; తపఃఅతప్యత = తపస్సుగావించెను; (అనగా తన సంకల్పమును విస్తరించి) ఇదమ్ = ఈ సమస్తమును; (చరాచర జగత్తు నంతటిని) అసృజత = సృజించియుండెను; తత్సృష్ట్వా = అట్లు జగత్తును సృష్టించినయనంతరము; తానునుస్వయముగ నాసృష్టియందే; అనుప్రావిశత్ = ప్రవేశించియుండెను; తదను ప్రవిశ్య = అట్లు ప్రవేశించి తానే స్వయముగ; సచ్చత్యచ్చఅభవత్ = మూర్త అమూర్త స్థితిని పొందెను; నిరుక్తంచ అనిరుక్తమ్ = వాచ్యావాచ్యుఁడయ్యెను; నిలయనం చా నిలయనం = ఆశ్రయప్రదాతయు, ఆశ్రయమీయనివాఁడునయ్యెను; విజ్ఞానంచ అవిజ్ఞానంచ = చేతనాచేతనపదార్థమునయ్యెను; సత్యంచఅనృతమ్=సత్యాసత్యములున య్యెను; (కానిఇన్నిరూపములయందును తాను.) సత్యంఅభవత్ = సత్యస్వరూపమయ్యెను. కావున యత్కించ ఇదంతత్ = ఈ దృష్టిగోచరమగుచున్న చరాచర వస్తుసముదాయమంతయు; సత్యమ్ = సత్యమేఅయియున్నది. (సర్వంఖల్విదం బ్రహ్మ) ఇతి = ఈప్రకారముగ; ఆచక్షతే = జనులుచెప్పుఁచున్నారు; తదప్యేషః శ్లోకోభవతి = ఈవిషయము రాబోవు అనువాకమున కూడ వివరింపఁబడుచున్నది.

వ్యాఖ్య:- స్పష్టము. దృష్టిగోచరమగుచున్న చరాచర జగత్తుయావత్తు పరబ్రహ్మమగు పరమేశ్వరునిచే నావృతమైయున్నది. అసలు బ్రహ్మముండెనా? లేదా? అనుసందేహము తొలఁగినది.

## సప్తమానువాకము
## ( సందేహనివారణము – బ్రహ్మాస్తిత్వ నిశ్చయము )

1. మంత్రము:- అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత. తదాత్మానగ్ం స్వయమకురుత। తస్మా త్తత్సుకృత ముచ్యత ఇతి।

అర్థము:- అగ్రే = పరమేశ్వరుఁడు తన్ను తాను ప్రకటించుకొనుటకు ముందు; ఇదమ్ = ఈ జడచేతనాత్మకమయిన జగత్తు; అసత్ వై ఆసీత్ = అవ్యక్త రూపముగనేఉండెను; తతః = ఆ అవ్యక్తరూపమునుండియే; వై = నిశ్చయముగా; సత్ = నామరూపమయ ప్రత్యక్ష జగత్తు అజాయత = ఉత్పన్నమయ్యెను; తత్ = ఆపరబ్రహ్మము; ఆత్మానం స్వయమకురుత = తనకుతానుగనే తన నీరూపమున ప్రకటించుకొనెను; తస్మాత్ = అందుచేత, తత్ = ఆపర బ్రహ్మము, సుకృతమ్ ఉచ్యతే = సుకృతమని పిలువఁబడుచుండును, ( సుకృత = తనను తాను బాగుగ చేసుకొనిన) ఇతి = అనునదియీమంత్రార్థము.

వ్యాఖ్య:- ఈ జగత్తంతయు మొదట నవ్యక్తరూపము; పరమేశ్వర సృష్టిచే నిది నామమయమైనది. కావున నిదియంతయు నాపర బ్రహ్మ స్వరూపమే. పై అనువాకమునందలి ఈ ప్రతిపాదనమే ఇట వివరింపఁబడుచున్నది.

2. మంత్రము:- యద్వై తత్సుకృతం రసో వై సః। రసగ్ంహ్యేవా యం లబ్ధ్వాఽఽనందీ భవతి। కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్। ఏష హ్యేవానన్దయాతి॥

అర్థము:- వై = నిశ్చయముగ; యత్ తత్ = ఏదైతే అ; సుకృతమ్ = సుకృతనామమున వ్యవహరింపఁబడు పరబ్రహ్మము; సః వైరసః = అతఁడే ఆనందమయ రస స్వరూపమైయున్నాఁడు; అయమ్ = ఈ జీవాత్మ; రసమ్ = ఆ రస స్వరూపుఁడగు పరబ్రహ్మమును, లబ్ధ్వ ఏవ = పొందియే; ఆనందీభవతి = ఆనంద యుక్తుఁడగుచున్నాఁడు; యది = ఒక వేళ; ఏషః ఆనందస్వరూపః = ఈ ఆనంద స్వరూపుఁడును; ఆకాశః = ఆకాశమువలె సర్వత్ర వ్యాపించిన వాఁడగు పరమాత్మ; నహి స్యాత్ = లేకున్నట్లయితే; కఃఏవ = ఎఁవడు; అన్యాత్ = జీవింపఁగలఁడు? కః ప్రాణ్యాత్ = ఎవఁడు రక్షింపఁగలడు? హి = నిస్సం దేహముగ; ఏషఃఏవ = ఈ పరమాత్మయే; ఆనందయాతి = ఆనంద ప్రదాతయగుచున్నాఁడు.

వ్యాఖ్య:- సుకృతనామమున వ్యవహరింపఁబడు పరమాత్మయే రస స్వరూపుఁడు. జీవాత్మ ఈ పరమాత్మను పొంది ఆనంద భరితుఁడగు చున్నాఁడు. ఈ పరబ్రహ్మమే లేఁడని భావించినచో ఎవఁడీలోకమున జీవింపఁగలఁడు? ఎవఁడీలోకమును రక్షింపఁగలఁడు? కనుక పర బ్రహ్మమున్నట్లును, అతఁడే ఆనంద ప్రదాతయనియు నిర్ణయ మగుచున్నది.

3 మంత్రము:- యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరు క్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే। అథ సోఽభయం గతో భవతి॥

అర్థము:- హి = ఎందువల్లననగా, యదా ఏవ = ఎప్పుడయిన, ఏషః = ఈ జీవాత్మ, ఏతస్మిన్ = ఈ, అదృశ్యే = దృష్టిగోచరము కాని; అనాత్మ్యే = శరీరరహితమయిన, అనిరుక్తే = అనిర్వచనీయమయిన,

అనిలయనే = పరాశ్రయముకోరని, (పరబ్రహ్మమగు పరమాత్మలో) అభయం = నిర్భయమయిన, ప్రతిష్ఠాం = స్థితిని, విన్దతే = పొందగల్గునో, అథ = అప్పుడు, సః = ఆ జీవాత్మ, అభయం = నిర్భయపథమును, గతః భవతి = పొందును. అనగా భయశోక విరహితుఁడగును.

వ్యాఖ్య:- పరమేశ్వరుని పొందగోరు జీవుఁడు ఆపర బ్రహ్మమునందు విచల స్థితి నెపుడు పొందునో అప్పుడతఁడు భయశోక రహితుఁడై ఆ పరబ్రహ్మమును పొందఁగల్గును.

4. మంత్రము:- యదా హ్యేవైష ఏతస్మిన్ను దరమన్తరం కురుతే। అథ తస్య భయం భవతి। తత్త్వేవ భయం విదుషో మన్వానస్య। తదప్యేష శ్లోకో భవతి।

అర్థము:- హి = ఎందు వల్లననగా, యదాఏవ = ఎప్పటివఱకు' ఏషః = ఈ జీవాత్మ, ఉదరమ్ = కొంచెమైనను కూడ, ఏతస్మిన్నంతరంకురుతే = ఈ పరమాత్మలో వినియోగము పొందునో, తస్య = వానికి, అథ = అంతవఱకును, జన్మమృత్యు రూప భయము ప్రాప్తించును, తదేవభయమ్ = ఆదేభయము, (మూర్ఖులకు మాత్రమే కాక) మన్వానస్య = అభిమానియగు నట్టియు; విదుషః = శాస్త్రజ్ఞుఁడగు విద్వాంసునకును కలుగుచున్నది, తదప్యేష శ్లోకోభవతి = ఈ విషయమునను రాబోవు మంత్రము వర్తించుచున్నది.

వ్యాఖ్య:- జీవాత్మ పరమేశ్వరుని నిరంతర స్మరణము చేయక కించిత్కాలమైన మఱచునో, అపుడాతనికి పునర్జన్మ ప్రాప్తి కలదు. జన్మించిన వానికి మరణముతప్పదు. (జాతస్య హి ధ్రువో మృత్యుః) కావున జీవికి అంతిమ సంస్కారాను రూపమయిన జన్మలభించును. యోగభ్రష్టుడయినవానికే పునర్జన్మ. కావున ఆ భయము లేకుండుటకై

నిరంతర భగవన్నామస్మరణమత్యంతావశ్యకము. ఆ భయము కేవలము మూఢునకే కాక విద్వాంసునకు సైతముండును. ఎందుచేతననగా అందఱపైనను పరమేశ్వర శాసన ప్రభావము కలదు. ఆశక్తిచేతనే సమస్త ప్రపంచ వ్యవస్థ నియమిత రూపమున నడచుచున్నది. ఈ విషయము అష్టమానువాకము నందును వివరింపఁబడుచున్నది.

## అష్టమానువాకము
## (బ్రహ్మానంద వివరణము)

1. మంత్రము:- భీషాస్మాద్వాతః పవతే। భీషోదేతి సూర్యః। భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ। మృత్యుర్ధావతి పంచమ ఇతి।

అర్థము:— అస్మాత్ భీషా = ఈ పరబ్రహ్మమువలని భయముచేతనే; వాతః పవతే = గాలి వీచుచున్నది; భీషా = ఈ భయమువలననే; సూర్యః ఉదేతి = సూర్యుఁడు ఉదయించుచున్నాడు; అస్మాత్‌భీషా = ఈ భయము వలననే; అగ్నిః = అగ్ని, ఇంద్రశ్చ = ఇంద్రుఁడును, పంచమః = వాతాదుల వరుసలో నైదవ వాఁడయిన, మృత్యుః = మృత్యువు కూడ, ధావతి = వారివారికార్యము లందు ప్రవర్తించుచున్నారు, ఇతి = అనునది ఈ మంత్రార్థము.

వ్యాఖ్య:- పరబ్రహ్మమగు నా పరమేశ్వరుని భయము చేతనే, తదాజ్ఞానువర్తులయి, వాయ్వగ్న్యాదు లందరు తమతమ కార్యములను నిర్వర్తించుచున్నారు. అనగా సూర్యాది దేవతలను కూడ క్రమము తప్పక ప్రవర్తింపఁజేయు నతీతమయిన దివ్య శక్తి యొకటున్నదని గ్రహింపనగుచున్నది కదా! ఆ శక్తియే పరబ్రహ్మము. అట్టియాతని

యానంద మెంతటిది? ఎట్టిది? మున్నగు విషయములపై విచారింప వలసియున్నది.

2. మంత్రము:- సైషాఽఽనందస్య మీమాంసా భవతి। యువా స్యాత్ సాధుయువాధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠస్తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్, స ఏకో మానుష ఆనందః।

అర్థము:- సవీషా = ఆఈ ఆనంద సంబంధమయిన విషయము, మీమాంసాభవతి = విచారింపఁబడుచున్నది, యువాస్యాత్ = ఒకయువకుఁడున్నచో నతఁడు, (అసాధారణుఁడు), సాధుయువా = శ్రేష్ఠ కార్యములనాచరించు యువకుఁడై, అధ్యాయకః = వేదాధ్యయన తత్పరుఁడై, ఆశిష్ఠః = పరిపాలనాదక్షుఁడై, ద్రఢిష్ఠః = సర్వాంగముల తో దృఢ శరీరుఁడై, బలిష్ఠః = అన్ని విధముల బల్లిదుఁడైయుండునో, తస్య = అతనికి, ఇయం విత్తస్యపూర్ణా పృథివీస్యాత్ = సర్వధనపరిపూర్ణమగునీ సమస్త క్ష్మాతలముండును, సః = ఆయువకుఁడు, మానుషః = మనుష్య లోకమునకు, ఏకః ఆనందః = ఒక ఆనందమై యున్నాఁడు.

వ్యాఖ్య:- సదాచారుడు, సచ్ఛీలి, సత్కుల సంజాతుఁడు, వేదాధ్యయన సంపన్నుఁడు, బ్రహ్మచారులకు సదాచారపాలనము నందు శిక్షణ నిచ్చుటలో నత్యంత కుశలుఁడు, దృఢశరీరి, బలసంపన్నుఁడయిన యువకుఁడు సర్వధనపరిపూర్ణమగు నీసమస్త క్ష్మామండలమునకు అధికారియగును. అట్టి మానవుఁడు ఈ మనుష్య లోకమునకు మహత్తరమయిన ఆనందము. ఇది మానుషానందము.

3. మంత్రము:- తే యే శతం మానుషా ఆనందాః। స ఏకో మనుష్య గంధర్వాణామానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

అర్థము:- తేయే మానుషా శతమ్ ఆనందాః = అట్టి మానుషానందము లొకనూఱయినచో; సః = అట్టిది; మనుష్యగంధర్వాణామానందః = ఒక మనుష్య గంధర్వానంద మనఁబడును; అకామహతస్య = ఎవని యొక్క అంతఃకరణము భోగకామనలచే దూషితము కాకుండునో, అట్టి; శ్రోత్రియస్యచ = వేదవేత్త యగు పురుషునకును; ఈమనుష్య గంధర్వానందము స్వాభావికమగును.

వ్యాఖ్య:- మనుష్యయోని యందు జన్మించి, ఉత్తమకర్మల నాచరించి గంధర్వభావమును పొందియున్నవారు మనుష్యగంధర్వులు; మానుషానందమునకు 100రెట్లు మనుష్య గంధర్వానందము. ఇకపై తెలుప బోవు ఇట్టియానందములన్నియు, మనస్సును కామవశము చేయని వేదవేత్తయగు శ్రోత్రియపురుషునకే స్వభావతః ప్రాప్తించును.

4 మంత్రము:- తే యే శతం మనుష్యగంధర్వాణామానందాః। స ఏకో దేవ గంధర్వాణామానందః। శ్రోత్రియస్య చాకామహతస్య.

వ్యాఖ్య:- పైనచెప్పఁబడిన మనుష్య గంధర్వానందములు నూఱుకలిపినచో ఒక దేవ గంధర్వానందము.

5 మంత్రము;- తే యే శతం దేవ గంధర్వాణామానందాః। స ఏకః పితౄణాంచిరలోకలోకానామానందః।శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- పైన చెప్పఁబడిన దేవగంధర్వానందములు నూఱుకలిసి ఒక పితృచిరలోకలోకానందమగును అనగా చిరస్థాయిగా పితృలోకమున నివసించెడి పితరులకు ఒక ఆనందము.

6. మంత్రము:- తే యే శతం పితౄణాం చిరలోకలోకానామానందాః। స ఏక ఆజానజానాం దేవానామానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- పైన చెప్పబడిన పితృ చిరలోక లోకానందములు నూఱు కలసి ఒక ఆజానజ దేవానందమగును, దేవ లోకమున నొక విశేష స్థానమునకు 'ఆజానము' అని పేరు. స్మృతి ప్రతిపాదితములగు పుణ్య కర్మల నాచరించి అచట నివసించువారు 'ఆజానజులు'.

7. మంత్రము:- తే యే శతం ఆజానజదేవానామానందాః। స ఏకః కర్మ దేవానాం దేవానామానందః। యే కర్మణా దేవానపి యన్తి। శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- అట్టి ఆజానజ దేవానందములు నూఱు కలసి 'కర్మదేవత' లను పేరుగల దేవతల యొక్క ఒక ఆనందమగును. యేకర్మణా దేవానపియన్తి = ఎవరు వేదోక్త కర్మలచే దేవభావములను పొంది యున్నారో వారికిని, భోగవిరహితమనస్కుడగు శ్రోత్రియునకును అట్టి యానందము స్వభావతః లభించుచున్నది.

8. మంత్రము:- తే యే శతం కర్మదేవానాం దేవానామానందః। స ఏకో దేవానామానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- అట్టి కర్మ దేవానందములు నూఱు కలసి ఒక దేవానంద మగును.

9. మంత్రము:- తే యే శతం దేవానామానందాః। స ఏక ఇంద్రస్యానందః। శ్రోత్రియస్య। చాకామహతస్య।

వ్యాఖ్య:- అట్టి దేవానందములు నూఱుకలసి ఒక ఇంద్రానందమగును.

10. మంత్రము:- తే యే శతమిన్ద్రస్యానన్దాః। స ఏకో బృహస్పతేరానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- అట్టి నూఱు ఇంద్రానందములు కలసినచో అది యొక బృహస్పతి యానందము.

**11.** మంత్రము:- తే యే శతం బృహస్పతేరానందాః। స ఏక ప్రజా పతేరానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- అట్టి బృహస్పతియొక్క నూఱు ఆనందములు కలసి ప్రజాపతికి ఒక ఆనందమగుచున్నది.

12. మంత్రము:- తే యే శతం ప్రజాపతేరానందాః। స ఏకో బ్రహ్మణ ఆనందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

వ్యాఖ్య:- అట్టి ప్రజాపతి యొక్క నూఱు ఆనందములు కలసి ఒక బ్రహ్మానందమగుచున్నది. బ్రహ్మానందమనగానింతటియానందరాశి. బ్రహ్మలోక పర్యంతమగు భోగము లందేమాత్రము నాస్థలేనివానికి, శ్రోత్రియుఁడగు పుణ్యాత్మునకును ఈ బ్రహ్మానందము స్వభావ సిద్ధముగనే ప్రాప్తించుచున్నది.

ఈ విధముగ ఒక ఆనందముకంటె మఱియొక ఆనందము నూఱురెట్లధికమై, బ్రహ్మానందము సర్వోత్కృష్ట మగుచున్నది. ఈ దృశ్యమాన ప్రపంచమందెంతటి ఉత్కృష్టమైన ఆనందమయ్యును అయ్యది బ్రహ్మానందముతో పోల్చినచో తుచ్ఛమే అగుచున్నది. బృహదారణ్యకోపనిషత్తునందుకూడ 'సమస్త ప్రాణులు నీ బ్రహ్మానందము నందలి ఏదో ఒక అంశను పొందియే జీవించుచున్నారు.' అని కూడ తెలుపఁబడినది.

13. మంత్రము:- స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః। స య ఏవం విదస్మాల్లోకాత్ ప్రేత్య। ఏతమన్నమయమాత్మానముపసంక్రామతి। ఏతం మనోమయమాత్మానముప సంక్రామతి। ఏతం విజ్ఞానమయమాత్మానముపసంక్రామతి। ఏతమానందమయమాత్మానముప సంక్రామతి। తదప్యేష శ్లోకో భవతి।

అర్థము:- సః = ఆపరమాత్మయే; యశ్చాయంపురుషే = సాధారణ పురుషుని యందున్నవాఁడును; యశ్చాసావాదిత్యే = ఉత్కృష్ట పురుషుఁడగు సూర్యుని యందున్న వాఁడునై; సఏకః = ఒక్కఁడే అగుచున్నాఁడు; ఏవంవిత్ యఃసః = ఈవిధముగ నెవఁడైతేతెలిసికొనునో అతఁడు; అస్మాత్ లోకాత్ ప్రేత్య = ఈలోకమును విడిచిన యనంతరము; ఏతమన్నమయ మాత్మానముప సంక్రామతి = అన్నమయాత్మను పొందుచున్నాఁడు; అనంతరము ప్రాణమయాత్మను, అట్లే క్రమముగ మనోమయాత్మను విజ్ఞానమయాత్మను, ఆనందమయాత్మను పొందుచున్నాడు; తదప్యేష శ్లోకోభవతి = ఈవిషయ మనంతరానువాకమున కూడ వివరింపఁబడుచున్నది.

వ్యాఖ్య:- ఆ పరమాత్మ సామాన్య మానవుని యందును ఉన్నాడు, మానవులారాధించు సూర్య దేవుని యందును ఉన్నాఁడు. కావున సర్వాంతర్యామియగునా పరబ్రహ్మ మొక్కఁడే అని యెవడు తెలిసికొనఁగల్గుచున్నాఁడో, అతఁడిహలోకమునువీడినయనంతరము క్రమముగ అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ ఆత్మలను పొందుచున్నాఁడు. అనగా ఈఐదును ఎవని యొక్క స్వరూపములో అట్టి పరమాత్మను పొందుచున్నాడు. ఈ అయిదు శరీరములను వివరించు నాయా సందర్భములలో సమస్త శరీరాన్తర్వర్తియగు పరమాత్మను గూర్చి వివరింపఁబడియేఉన్నది. ఫల రూపమున వానిప్రాప్తి జరుగుచున్నది. అతఁడే బ్రహ్మము. కావున బ్రహ్మవేత్తయగు మానవుఁడు అన్నమయ శరీరమును విడచుట తోడనే పొందు ఫలితమే పరమాత్మ. అంతేకాని మఱియొక శరీరము కాదు. బ్రహ్మవేత్తయగు మానవునకు పునర్జన్మ లేదని గ్రహింపవలయును.

# నవమానువాకము

## ( ఫలశ్రుతి )

1. మంత్రము:- యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ నేతి। ( Ref 2.4)

అర్థము:- మనసాసహ = మనస్సుతో కూడ; వాచః = వాగాది సమస్తేంద్రియములు, యతః అప్రాప్య=ఎచట నుండి వానిని పొందలేక; నివర్తన్తే = తిరిగిపోవుచున్నవో; (అట్టి) బ్రహ్మణః ఆనందం = బ్రహ్మానందమును; విద్వాన్ = తెలిసికొనఁగల్గిన మహాపురుషుఁడు; కుతశ్చన = ఎవరి వలన కూడ, నబిభేతి = భయమునుపొందడు.

2. మంత్రము:- ఏతగ్ంహ వావ న తపతి। కిమహగ్ం సాధు నాకరవమ్। కిమహం పాపమకరవమితి। స ఏవం విద్వానేతే ఆత్మానగ్ం స్పృణుతే. ఉభే హ్యేవైష ఏతే ఆత్మానగ్ం స్పృణుతే। య ఏవం వేద। ఇత్యుపనిషత్॥

అర్థము:- హవావ = ఇది ప్రసిద్ధమయిన విషయము. (ఏదనగా); ఏతమ్ = ఆమహాపురుషుని; (ఈ విషయము) నతపతి = బాధించదు; (ఏదనగా)అహం కిం సాధున అకరవమ్ ఇతి = నేను శ్రేష్ఠకర్మముల నేలయాచరింపలేదని; కిమహం పాపమకరవమితి = నేనుపాపకర్మములనేల ఆచరించితినని యః ఏతే ఏవం విద్వాన్ = ఎవఁడుఈపుణ్య పాపకర్మలను సంతాప హేతువులుగ తెలిసికొనునో; సః ఆత్మానం స్పృణుతే = అతఁడాత్మనురక్షించుకొనును; హి యః ఏతే ఉభే ఏవ

ఏవం వేద = అవశ్యము ఈ పుణ్య పాపములను, రెండు విధములగు కర్మములను సంతాప కారణములని ఎవఁడు గ్రహించునో; స ఏషః ఆత్మానంస్పృణుతే = ఆపురుషుఁడాత్మను రక్షించుకొనును; ఇత్యుప నిషత్ = ఈ ప్రకారముగ బ్రహ్మానందవల్లి పూర్తియైనది.

వ్యాఖ్య:- బ్రహ్మానందమును పొందిన పురుషునకు దేని వలనను భయము లేదు. ఈ వల్లియందు వివరింపబడిన విధముగ జ్ఞానియగు పురుషుఁడు "నేను శ్రేష్ఠకర్మలనేల యాచరింపలేదు? లేక పాప కర్మలనేల యాచరించితినని విచారింపఁడు. అతనికట్టి యవసరము లేగు. ఆతని మనసున పుణ్యకర్మల యొక్క ఫలస్వరూపము ఉత్తను లోక ప్రాప్తిలోభము ఉండనే ఉండవు. పాప జనితమగు నరకాది భయము నతనికిలేదు. అతఁడుజ్ఞాని, విద్వాంసుఁడు కావున "ఆసక్తి పూర్వకముగ చేయు పుణ్య పాప కర్మలను జనన మరణాది రూప సంతాప హేతువులు" అని తెలిసికొని, వాని యెడల జనించు రాగ ద్వేషములకతీతుఁడై సర్వదా పరమాత్మ చింతనమునందే తన మనమును కేంద్రీకరించి, ఆత్మరక్షణము గావించుకొనును. ఇది బ్రహ్మానందవల్లి.

# భృగువల్లి

## ప్రథమానువాకము

## ( భృగుతపస్సు )

మంత్రము:- భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార। అధీతి భగవో బ్రహ్మేతి। తస్మా ఏతత్ప్రోవాచ। అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనో వాచమితి। తగ్ం హోవాచ। యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతానిజీవన్తి। యత్ప్రయన్త్యభిసంవిశంతి। దత్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి। స తపోఽతప్యత। సతపస్తప్త్వా।

అర్థము:- వై = ఇది ప్రసిద్ధమయిన విషయము; (ఏమనగా) వారుణిః = వరుణునియొక్క పుత్రుడయిన; భృగుః = భృగువు; పితరమ్ = తన తండ్రియగు; వరుణం ఉపససార = వరుణుని వద్దకు పోయెను; భగవః = ఓపూజ్యుడా; (నాకు) బ్రహ్మ అధీహి = బ్రహ్మోపదేశముగావింపుము; ఇతి = అని ప్రార్థించినపిమ్మట; తస్మై = వానినిగూర్చి వరుణుడు; ఏతత్ ప్రోవాచ = ఈవిధముగ పలికెను; అన్నం, ప్రాణం, చక్షుః, శ్రోత్రమ్, మనః, వాచం ఇతి = అన్న ప్రాణ నేత్ర శ్రోత్రమనోవాక్కులని (బ్రహ్మోపలబ్ధికివన్నియు మార్గములని) తంహఉవాచ = తిరిగి వరుణుడు భృగువుతో నిట్లనియె; వై = నిశ్చయముగ, ఇమాని = ఈదృష్టిగోచరములగుచున్న; భూతాని = సమస్త ప్రాణులు; యతః = ఎవనినుండి, జాయన్తే = ఉత్పన్నములగుచున్నవో; జాతాని = ఉత్పన్నములైనవి; యేన = ఎవనివలన; జీవన్తి = జీవించుచున్నవో; (అట్లే) ప్రయన్తి = అన్తిమ కాలమున; యత్ అభిసంవిశన్తి = ఎవనియందు విలీనములగుచున్నవో; తత్ = వానిని; విజిజ్ఞాసస్వ = జిజ్ఞా

సతో తెలిసికొనుము, తత్ = అతఁడే; బ్రహ్మ = పరబ్రహ్మమగు పరమాత్మ; ఇతి = ఈవిధముగ చెప్పిన పితృవాక్యములనాకర్ణించి; సః తపః అతప్యత = భృగుమహర్షి తపస్సుగావించెను; సతపస్తప్త్వా = అతఁడట్లు తపము గావించి; (తరువాత ద్వితీయానువాకము)

వ్యాఖ్య:- భృగువు వరుణుని పుత్రుఁడు. అతఁడొకనాడు తండ్రిని సమీపించి, 'ఆర్యా! నాకు బ్రహ్మోపదేశము గావింపు'ఁడనెను. అంతట వరుణుఁడు 'పుత్రా! అన్నము, ప్రాణము, చక్షువులు, శ్రోత్రములు, మనస్సు, వాక్కు -ఇవి బ్రహ్మోపలబ్ధికి మార్గములు. వానినాశ్రయించి బ్రహ్మమును దర్శింపుము. మనకు దృష్టిగోచరములగుచున్న ఈ జీవులన్నియు నెవనిచేత జనించునో, ఎవనివలన పెంపొందించు జీవించుచున్నవో, చివరకు ఎవనియందుడిందునో, అట్టి మహాపురుషుని గూర్చి తెలిసికొనుము. అతఁడే బ్రహ్మము" అని చెప్పగా భృగువు తపస్సు గావించెను.

## ద్వితీయానువాకము
## (అన్నము బ్రహ్మమని తెలిసికొనుట)

మంత్రము: అన్నం బ్రహ్మేతి వ్యజానాత్। అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। అన్నేన జాతానిజీవన్తి। అన్నం ప్రయన్త్యభిసంవిశన్తీతి। తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితరముపససార। అధీతి భగవో బ్రహ్మేతి। తగ్ంహోవాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా। (Ref బ్రహ్మ-2)

అర్థము:- అన్నము = అన్నమును; బ్రహ్మేతి = బ్రహ్మమని; వ్యజానాత్ = తెలిసికొనెను; హి = ఎందువల్లననగా; అన్నాదేవ = అన్నము నుండియే; ఇమాని భూతాని = ఈప్రాణులన్నియు; జాయన్తేఖలు =

జనించుచున్నవికదా!; జాతాని = జనించిన జీవులు; అన్నేన జీవన్తి = అన్నము వలననే జీవించుచున్నవి; ప్రయన్తి = అన్తకాలమున; అన్నం అభిసంవిశన్తి = అన్నమునందే విలీనములగుచున్నవి; ఇతి తత్ విజ్ఞాయ = ఈ విధముగ బ్రహ్మమును తెలిసికొని; పునఃపితరం వరుణమేవ ఉపససార = తిరిగి తండ్రియగు వరుణునివద్దకుపోయెను; భగవః బ్రహ్మ అధీహి ఇతి = ఓపూజ్యుఁడా! నాకు బ్రహ్మోపదేశము చేయుమనెను; తంహాఉవాచ = అభృగువుతో వరుణుఁడిట్లనెను: తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ = తపస్సుగావించి బ్రహ్మమును తెలిసికొనుము; తపోబ్రహ్మేతి = తపస్సే బ్రహ్మమనియు చెప్పెను; సః తపః అతప్యత = అభృగువు మరల తపస్సు గావించెను; సతపస్తప్త్వా = అతఁడట్లు మరల తపస్సుచేసి (తృతీయాను వాకమున కొనసాగును)

వ్యాఖ్య:- భృగువు తపస్సుగావించి, అన్నమును బ్రహ్మముగా తెలిసికొనెను. ఏలయనగా జీవులన్నియు అన్నము వలన నుండి జనించుచున్నవి. జీవించుచున్నవి. దానియందే లయమగుచున్నవి. ఇట్లు తెలిసికొని, భృగువు మరల తన తండ్రివద్దకు పోయి, బ్రహ్మోపదేశము గావింపుమనెను. అంతట వరుణుఁడు తపస్సు చేసి బ్రహ్మమును తెలియుమనెను. తపస్సే బ్రహ్మమని చెప్పెను. అందుచే మరల భృగువు తపస్సు గావించెను.

## తృతీయానువాకము
## (ప్రాణమును బ్రహ్మమని తెలియుట)



మంత్రము:- ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్। ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। ప్రాణేన జాతాని జీవన్తి। ప్రాణం ప్రయన్త్యభిసంవిశన్తీతి। తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితరముపససార।

అధీహి భగవో బ్రహ్మేతి। తగ్ంహోవాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా।

(Ref బ్రహ్మ-3)

అర్థము:- ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్ = భృగువు తపస్సు చేసి ప్రాణమే బ్రహ్మమని తెలిసికొనెను; ప్రాణాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయన్తే = ప్రాణము నుండియే (అనగా బ్రహ్మమువలననే) ఈ భూతములన్నియు జనించుచున్నవి; ప్రాణేన జాతాని జీవన్తి = ప్రాణమువలననే జనించినవి జీవించుచున్నవి; ప్రాణం ప్రయన్త్యభిసంవిశన్తీతి = ప్రాణమునందే తమ అన్తకాలమున విలీనములగుచున్నవి. అని తెలిసికొనెను. (తక్కినది పూర్వానువాకము నందువలెనే స్పష్టము)

వ్యాఖ్య:- భృగువు తపస్సుచేసి మొదట అన్నమును బ్రహ్మమని తెలిసికొనెను. అనంతరము మరికొంత తపస్సు చేసి ప్రాణమును బ్రహ్మమని తెలిసికొనెను. మరల తండ్రి నాశ్రయింపగా నతడు బ్రహ్మమును గూర్చి ఇంకను తపస్సు చేయుమని బోధింపగా భృగువందులకుద్యమించెను.

## చతుర్థానువాకము

## (మనస్సును బ్రహ్మముగా తెలిసికొనుట)

మంత్రము:- మనోబ్రహ్మేతి వ్యజానాత్। మనసోహ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। మనసా జాతాని జీవన్తి। మనః ప్రయన్త్యభిసంవిశన్తీతి। తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితరముపససార। అధీహి

భగవో బ్రహ్మేతి। తగ్ంహోవాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా।

**అర్థము:-** మనోబ్రహ్మేతి వ్యజానాత్ = మరల తపస్సు గావించి భృగువు 'మనస్సును బ్రహ్మము'ని తెలిసికొనెను; మనసోహ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే = మనస్సు చేతనే ప్రాణులు జనించుచున్నవి; మనసా జాతాని జీవన్తి = మనసు చేతనే పుట్టిన ప్రాణులు జీవించుచున్నవి; మనః ప్రయన్త్యభిసంవిశన్తీతి = అన్త కాలమున ఆ మనస్సు నందే తిరిగి ప్రవేశించి విలీనములగుచున్నవి; అని తెలిసికొనెను. (తక్కినది ద్వితీయాను వాకమునకు వలెనే)

**వ్యాఖ్య:-** తండ్రి చెప్పిన ప్రకారము భృగువు తపస్సు చేసి మొదట అన్నమును, పిమ్మట ప్రాణమును, పిమ్మట మనస్సును బ్రహ్మముగా తెలిసికొనెను. సృష్టి స్థితిలయములూ బ్రహ్మము వలననే జరుగుచున్నవనియు గ్రహించెను. తన తపస్సును కొనసాగించెను.

## పంచమానువాకము

## (విజ్ఞానమును బ్రహ్మముగా తెలిసికొనుట)

**మంత్రము:-** విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్, విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। విజ్ఞానేన జాతాని జీవన్తి। విజ్ఞానం ప్రయన్త్యభిసంవిశన్తీతి। తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి। తగ్ంహోవాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా।

**అర్థము:-** విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ = విజ్ఞానమును బ్రహ్మమని తెలిసికొనెను; విజ్ఞానాత్ హి ఏవ ఖలు భూతాని జాయన్తే = విజ్ఞానము

వలననే ఈ భూతములు జనించుచున్నవి; విజ్ఞానం ప్రయన్త్యభిసం విశన్తి = తమ అన్త్యకాలమున నా విజ్ఞానమునందే విలీనములగుచున్నవి అని తెలిసికొనెను. (తక్కినది ద్వితీయానువాకమునకు వలెనే)

వ్యాఖ్య:- భృగువు మరల తపస్సు చేసి విజ్ఞానమును బ్రహ్మముగా తెలిసికొనెను. తనతపస్సును పితృవాక్యానుసారము కొనసాగించెను.

## షష్ఠానువాకము

## (ఆనందమును బ్రహ్మముగా తెలిసికొనుట)

మంత్రము:- ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్। ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। ఆనన్దేన జాతాని జీవన్తి। ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి। సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా। స ఏవం వేద ప్రతి తిష్ఠతి। అన్నవానన్నాదో భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన। మహాన్ కీర్త్యా!

అర్థము:- ఆనన్దం బ్రహ్మేతి వ్యజానాత్ = భృగువు తపస్సు చేసి ఆనందమును బ్రహ్మముగా తెలిసికొనెను; ఆనందాత్ హి ఏవఖలు ఇమాని భూతాని జాయన్తే = ఆనందము వలననే సమస్తజీవులు జనించుచున్నవి; ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తీతి = తమ అన్త్యకాలమున నానందముననే విలీనములగుచున్నవి; సా ఏషా = ఈ విద్య; భార్గవీ వారుణీ విద్యా = భృగు మహర్షి వరుణ మహర్షి వలన తెలిసికొనిన విద్య; పరమేవ్యోమన్ = విశుద్ధాకాశ స్వరూపుఁడగు పరమాత్మయందు; ప్రతిష్ఠితా = ప్రతిష్ఠింపఁబడియున్నది; అనగా పరిపూర్ణమైయున్నది; యః ఏవంవేద = ఎవఁడు ఈవిధముగా తెలిసికొనునో (అతఁడుకూడ పర బ్రహ్మమునందు); ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠింపఁబడినవాఁడగుచున్నాఁడు;

(మఱియునతడు) అన్నవాన్ = అన్నవంతుఁడును; అన్నాదః = అన్నమును బాగుగ పచనము చేయు శక్తికలవాఁడును; భవతి = అగుచున్నాఁడు; ప్రజయా = సంతానముచేతను, పశుభిః = పశు సంపదచేతను; బ్రహ్మవర్చసేన = బ్రహ్మతేజస్సంపదచేతను; మహాన్ భవతి = మహాత్ముఁడగుచున్నాఁడు; కీర్త్యా (అపి) మహాన్ భవతి = ఉత్తమకీర్తిచేతను సర్వశ్రేష్ఠుఁడగుచున్నాడు.

వ్యాఖ్య:- భృగువు తపస్సు చేసి ఆనందమును బ్రహ్మముగా తెలిసికొనెను. ఈ ఆనందమయ పరబ్రహ్మమే అన్నమయాదులకు అంతరాత్మ. అన్నమయాది శరీరములన్నియు ఆనందమయాత్మకు స్థూల రూపములు. సమస్త ప్రాణులును ఆనంద స్వరూపుఁడగు పరమాత్మ నుండియే సృష్ట్యాది యందుత్పన్నములైనవి. కావున నీ సృష్టికి ఆది కారణము ఆపరబ్రహ్మమే. ఆనందమయ స్వరూపుఁడగు నాపరమాత్మ నుండి అణుమాత్రమయిన ఆనందమును పొంది ప్రాణులన్నియును జీవించుచున్నవి. ఈ పరమాత్మయొక్క ప్రేరణము వలననే సమస్త ప్రాణులు తమ తమ చేష్టలను సాగించుచున్నవి. ఈ పరమాత్మకు లోఁబడి వర్తించు సూర్యాదు లొక్కనిమిషమాత్రమయిన తమ కార్యముల నిర్వర్తింపకున్నచో నీజగత్తు నిర్జీవమగును. కావున నీచరాచర సమస్త జగత్తునకు నీయానందమయ స్వరూపుఁడగు పరబ్రహ్మమే జీవనాధారము. ప్రళయకాలమున సమస్త ప్రాణులతో నిండియున్న బ్రహ్మాండమంతయు ఆతనియందే ప్రవిష్టమగుచున్నవి. ఈ ప్రకారముగ భృగువు బ్రహ్మతత్త్వమును చక్కగా గ్రహించెను. ఇదియే భృగువునకు వరుణుని వలన లభించిన బ్రహ్మ విద్యా రహస్యము. ఈ విద్య విశుద్ధాకాశ స్వరూపుఁడగు పరబ్రహ్మమందు ప్రతిష్ఠితమై యున్నది. ఏమానవుఁడయిన భృగువు వలె తపస్సునాచరించి, దీనిని విచారించి, పరమానంద స్వరూపుఁడగు పరబ్రహ్మమును తెలిసికొనఁ

గోరుచున్నాడో ఆతఁడు కూడ నా పరమాత్మ యందు ప్రతిష్ఠితు చున్నాఁడు. ఆతడు నానాప్రకారములగు జీవనయాత్రోపభోగము సంపన్నుఁడగుచున్నాఁడు. అతని మనస్సు ఇంద్రియములు శరీ సర్వథా నిర్వికారతను పొందుచున్నవి. అతడు సంతానము, ప ణము, బ్రహ్మతేజస్సు, అపారమగు కీర్తి మున్నగు వానిని పొ ఈ జగత్తునందు సర్వశ్రేష్ఠుడుగ గుర్తింపఁబడుచున్నాడు.

## సప్తమానువాకము

## ( అన్నము యొక్క మహత్త్వము — ప్రాణమే అన్నము )



మంత్రము:- అన్నం న నిన్ద్యాత్। తద్వ్రతమ్। ప్రాణో వా అన్నః। శరీరమన్నాదమ్। ప్రాణే శరీరమ్ ప్రతిష్ఠితమ్। శరీరే ప్రాణః ప ష్ఠితః। తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్। స య ఏతదన్నమన్నే ప్ర ష్ఠితం వేద ప్రతితిష్ఠతి। అన్నవానన్నాదో భవతి। మహాన్ భవతి। ప భిర్బ్రహ్మవర్చసేన। మహాన్ కీర్త్యా।

అర్థము:- అన్నం న నిన్ద్యాత్ = అన్నమును నిందింపరాదు; తత్ వ్రతమ్ = అదియొక వ్రతము; ప్రాణో వా అన్నమ్ = ప్రాణమే అన్నము; శరీరమ్=శరీరము; అన్నాదమ్=అన్నభోక్త; శరీరం ప్రాణే ప్రతిష్ఠితమ్=శరీరము ప్రాణముపై ఆధారపడియున్నది; ప్రాణః శరీరే ప్రతిష్ఠితః = ప్రాణము శరీరముపై ఆధారపడియున్నది: తత్ =ఆవిధ ముగ; ఏతత్=ఈ; అన్నే = అన్నమునందు; అన్నమ్ = అన్నము;

ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితమై యున్నది; యః = ఎవఁడు; ఏతత్ = ఈ రహస్యమును, వేద = తెలిసికొనునో; సః = అతఁడు ప్రతితిష్ఠతి = ఆ అన్నము నందు (బ్రహ్మము నందు) ప్రతిష్ఠితుఁడగుచున్నాఁడు; అన్నవాన్ = అన్నములు కలవాఁడును; అన్నాదః = అన్నము తినువాఁడును; భవతి = అగుచున్నాఁడు; ప్రజయా, పశుభిః, బ్రహ్మవర్చసేన మహాన్ భవతి = సంతానము, పశుగణము, బ్రహ్మతేజస్సు కలిగి మహాపురుషుఁడగు చున్నాఁడు; కీర్త్యా మహాన్ భవతి = కీర్తి సంపదచే కూడ మహాత్ముఁడగు చున్నాఁడు.

వ్యాఖ్య:- 6వ అనువాకమున బ్రహ్మజ్ఞాని అన్నాదులచే సంపన్నుఁడగుట వివరింపఁబడినది. దీనివిషయమున-

ఈ సౌఖ్యములను పొందుటకు బ్రహ్మసాక్షాత్కారమే ఏకైక మార్గమా? లేక రెండవమార్గమున్నదా? అనుసంశయము కలుగక మానదు. కావున నీసౌఖ్యములను పొందుటకు రెండవ మార్గము కూడ బోధింపఁబడుచున్నది.

అన్నమును నిందింపరాదు. అది వ్రతము. ఎందుచేతననగా ప్రాణమే అన్నము; శరీరము (ప్రాణరూప అన్నము చేత జీవించుచున్నది) అన్నమును భుజించుచున్నది. శరీరము ప్రాణముపై ఆధారపడియున్నది. ఆ ప్రాణము శరీరమునందుప్రతిష్ఠితమైయున్నది. ఈ విధముగ అన్నము నందే అన్నము ప్రతిష్ఠితమై యున్నదను రహస్యము నేమనుష్యుఁడు తెలిసికొనునో అతఁడట్టి అన్నము నందు (బ్రహ్మమునందు) ప్రతిష్ఠింపబడుచున్నాడు.

# అష్టమానువాకము
# ( జలమే అన్నము )



మంత్రము:- అన్నం న పరిచక్షీత। తద్వ్రతమ్। ఆపో వా అన్నమ్। జ్యోతిరన్నాదమ్। అప్సు జ్యోతిః ప్రతిష్ఠితమ్। జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః। తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్। స య ఏత దన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతి తిష్ఠతి। అన్నవాన్ అన్నాదో భవతి। మహాన్ భవతి। ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన। మహాన్ కీర్త్యా।

అర్థము:- అన్నం న పరిచక్షీత = అన్నమును అవహేళనచేయరాదు తద్వ్రతమ్ = అయ్యది వ్రతము; ఆపోవా అన్నమ్ = జలమేఅన్నము జ్యోతి రన్నాదమ్ = తేజస్సు అన్నమునుభుజించుచున్నది. (రస స్వరూపము); అప్సుజ్యోతిః ప్రతిష్ఠితమ్ = జలములందు తేజస్సు ప్రతిష్ఠితమైయున్నది; తదేతదన్నమనే ………………… మహాన్ కీర్త్యా (సప్తమానువాకమునకు వలెనే).

వ్యాఖ్య:- ఈ యనువాకమున జలము జ్యోతిస్సు ఈ రెండును అన్నరూపమున తెలుపఁబడినవి. అన్నాదులచే సమస్త సౌభాగ్యము లనందఁగోరి మానవుఁడు అన్నమునవహేళనముచేయరాదు; అన్నోల్లంఘన దురుపయోగ పరిత్యాగాదుల చేయరాదని తలఁపవలెను. అన్నముపట్ల ఉపేక్షకూడనిది. ఇట్టి భావమును వ్రతముగనాచరించుచు అన్నము యొక్క తత్త్వమును తెలిసికొనవలసియున్నది. జలమే అన్నము. సమస్తములగు అన్నపదార్థములు జలమునుండియే ఉత్పన్నములగు చున్నవి. జ్యోతి అనగా తేజస్సు. జలరూపమైన అన్నమును

భక్షించుచున్నది. అగ్ని సూర్యరశ్మి మొదలుగాగలవి జలముల నెట్లు శోషింపఁజేయుచున్నవో; అట్లే శారీరకమగు జఠరాగ్ని శరీరము నందలి జలీయ తత్వమును శోషింపఁజేయుచున్నది. జలములందు తేజస్సు ప్రతిష్ఠితమై యున్నది. (బడబాగ్ని) అట్లే వర్షర్తువున మెఱపు (విద్యుత్కాంతి); తేజస్సు నందు జలములు ప్రతిష్ఠితములై యున్నవి. సూర్యుని తీక్ష్ణ కిరణముల యందు నిక్షిప్తమైన జలము మేఘరూపమున వర్షించుచున్నది. ఈ విధముగ జలము, తేజస్సు అన్యోన్యాశ్రితములు. సమస్తములైన అన్నరూప ఖాద్యపదార్థములకు కారణములై ఈ జలతేజములే వాని రూపమున పరిణతి నొందు చున్నవి, అందుచేతనే ఈరెండును అన్నములగు చున్నవి. ఈవిధము గను, అన్నమే అన్నము నందు ప్రతిష్ఠితమైయున్నది. ఈవిషయము బాగుగ తెలిసిన మానవుడు ఆరెండింటిని సద్వినియోగము గావించు కొని సర్వసౌభాగ్యవంతుఁడును కీర్తిమంతుడునై, మహాపురుషుఁడ గుచున్నాఁడు.

## నవమానువాకము

## (పృథివియే అన్నము)



మంత్రము:- అన్నం బహు కుర్వీత। తద్వ్రతమ్। పృథివీ వా అన్నమ్ ఆకాశోఽన్నాదః। పృథివ్యామాకాశః ప్రతిష్ఠితః। ఆకాశే పృథివీ ప్రతి ష్ఠితా। తదేత దన్నమన్నే ప్రతిష్ఠితమ్। స య ఏతదన్నమన్నే ప్రతి ష్ఠితం వేద ప్రతితిష్ఠతి। అన్నవానన్నాదో భవతి। మహాన్ భవతి। ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన। మహాన్ కీర్త్యా।

అర్థము:- అన్నం బహుకుర్వీత = అన్నమునధికముగావింపవలెను; తద్వ్రతమ్ = అదివ్రతము; పృథివీవా అన్నమ్ = పృథివియే అన్నము

ఆకాశః అన్నాదమ్ = ఆకాశము పృథివీరూపమగు అన్నమునకాధారము; పృథివ్యాం ఆకాశః ప్రతిష్ఠతః=కావున పృథివియందాకాశము ప్రతిష్ఠితమైయున్నది; ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా = ఆకాశమునందు పృథివి ప్రతిష్ఠితమై యున్నది. తదేతదన్నమన్నే............ మహాన్ కీర్త్యా = సప్తమానువాకమునకు వలెనే.

వ్యాఖ్య:- ఈయనువాకమున పృథివ్యాకాశము లన్నరూపమున వివరింపఁబడినవి. అన్నాదులవలన సౌఖ్యమునందఁగోరుమానవుఁడు అన్నమును బాగుగావృద్ధి చేయవలెను పృథివియే అన్నము. సమస్త ఖాద్యపదార్థములు భూమినుండియే ఉత్పన్నములగు చున్నవి. ఈ పృథివిని తనలో విలీనము చేసికొని ఆకాశము అన్నభోక్తయగు చున్నది,పృథివియందాకాశము ప్రతిష్ఠింపఁబడినది. అదిసర్వవ్యాప్తమైయున్నది. ఆకాశమునందు పృథివి ప్రతిష్ఠింపబడియున్నది. అయ్యది సువిదితము. ఇట్లీ రెండును పరస్పరాశ్రితములైయున్నవి. రెండును అన్నరూపమును పొంది ఒకదానియందొకటి ప్రతిష్ఠింపబడి యున్నవి. ఈతత్వము బాగుగ తెలిసిన మానవుడు సమస్తభోగ భాగ్యములనుపొందుటయందు శక్తి సంపన్నుఁడగును. బ్రహ్మ తేజస్సు, పశుసంతానాది సమృద్ధినొంది; కీర్తిమంతుఁడై మహాపురుషుఁడగును.

## దశమానువాకము

## (అన్నారాధనము — అతిథిసేవనము)

మంత్రము:- న కంచన వసతౌ ప్రత్యాచక్షీత। తద్వ్రతమ్। తస్మాద్యయాకయాచ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్। ఆరాధ్యాస్మా అన్నమిత్యాచక్షతే। ఏతద్వై ముఖతోఽన్నగ్ం రాద్ధమ్। ముఖ

తోఽస్మా అన్నగ్ం రాధ్యతే। ఏతద్వైమధ్యతోఽన్నగ్ం రాద్ధమ్। మధ్యతోఽస్మా అన్నగ్ం రాధ్యతే, ఏత ద్వా అన్తతోఽన్నగ్ం రాద్ధమ్। అన్తతోఽస్మా అన్నగ్ం రాధ్యతే। య ఏవం వేద।

అర్థము :- వసతౌ = తనయింటికి వచ్చిన; కంచన = ఏ అతిథి కైనను, నప్రత్యాచక్షీత = ప్రతికూల సమాధానము నీయరాదు; తద్వ్రతమ్ = గృహస్థు దానినొక వ్రతముగ నాచరింపవలెను. తస్మాత్ = ఆ అతిథి సత్కారము కొఱకు; యయాకయాచ విధయా = ఏదోఒక విధముగ; బహుఅన్నం = అధికమగు అన్నమును; ప్రాప్నుయాత్ = పొందవలెను. (ఎందువల్లననగా) సద్గృహస్థుడు -అస్మై = తనుయింటికి వచ్చిన యతిథితో; అన్నం ఆరాధి ఇతి = అన్నముసిద్ధముగనున్నదని; ఆచక్షతే = చెప్పుచున్నాడో; ముఖతః = ఆ అతిథికి శ్రద్ధా ప్రేమాది సత్కార పూర్వకముగా; ఏతత్ రాద్ధమ్ అన్నమ్ = ఈ సిద్ధముగావింపబడిన అన్నమును పెట్టుచున్నాడో; అస్మై = అట్టి దాతయగు గృహస్థునకును; ముఖతః = అధికాదర సత్కారముతో కూడియే; అన్నం = అన్నము; రాధ్యతే = లభించు చున్నది; మధ్యతః = మధ్యమశ్రేణికి చెందిన శ్రద్ధతో; ఏతత్ రాద్ధమ్ అన్నమ్ = ఈ సిద్ధముగావింపఁబడిన అన్నమును పెట్టినచో. వై = నిస్సందేహముగ; అస్మై = ఆదాతకును; మధ్యతః = మధ్యమశ్రేణికి చెందిన ఆదరము తోడనే; అన్నం రాధ్యతే = అన్నము లభించు చున్నది; అన్తతః = నికృష్టమగు శ్రద్ధతో (శ్రద్ధా రహితముగ) ఏతత్ రాద్ధమ్ అన్నమ్ = ఈ సిద్ధముగావింపఁబడిన అన్నమును పెట్టి నచో; వై = నిశ్చయముగ; అస్మై = అట్టి దాతకును, అన్తతః = నికృష్టమైన (శ్రద్ధారహితమైనట్టి) అన్నం రాధ్యతే = అన్నము లభించుచున్నది. యః ఏవంవేద = ఈ ప్రకారముగ నెవఁడీ రహస్య మును తెలిసికొను చున్నాడో; అట్టిగృహస్థుఉత్తమమయిన, మర్యాదా

పూర్వకమయిన శ్రద్ధాసక్తమయిన అతిధి సేవనము గావించును.

వ్యాఖ్య :- దశమాను వాకమునందలి ఈ ప్రథమాంశమున అతిధి సేవా మహత్త్వ ఫలములు వివరింపబడినవి.

గృహస్థు తన యింటికి వచ్చిన ఏ అతిధినయిన నిరాదరింప రాదు. ప్రేమ,మర్యాద,శ్రద్ధ, సత్కార భావములను కల్గియుండవలెను. అట్లు అతిధులను సేవింపవలసినదే. తన్నిమిత్తము గృహస్థు అధికాహారము నేదోవిధముగ సేకరించి యుంచు కొనవలెను. ఏదోవిధముగ ననగానయ్యది న్యాయోపార్జితమని తప్పక స్మరింపదగినది. అతిధి సేవనము గృహస్థోచిత సదాచారములలో నత్యావశ్యకమైనది. తనయింటి కేతెంచిన అతిధిని శ్రద్ధతో ప్రేమతో నాహ్వానించి అర్ఘ్యపాద్యాచి తాసనాదుల నర్పించి, అన్నము పెట్టవలెను. అట్లు శ్రద్ధాపూర్వకముగ నతిధిని సేవించు గృహస్థుకూడ అంతటి మర్యాద ప్రేమ శ్రద్ధలతో కూడిన ఆహ్వానమును, అన్నాదులను పొందఁగల్గును. మధ్యమశ్రేణి సత్కారము నతిధులకిచ్చు గృహస్థు తానును అట్టి ఆదరముతో కూడిన అన్నమునకే పాత్రుడఁగును. అతిధిని శ్రద్ధారహితముగ చూచు గృహస్థు తానును అట్టి ఆదరముతో కూడిన అన్నమునకే పాత్రుఁడగును. అతిధిని శ్రద్ధా రహితముగ చూచు గృహస్థు తానును అట్టి నిరాదరణమునకు ఛీత్కారమునకు గురియగును. అన్నము లభింపవచ్చును. కాని ఆదరణమునకు చోటుండదు. తానాఁచరించిన కదా తనకు లభించునద! కావుననే గృహస్థయినను సర్వోత్తమవిధానముతో శ్రద్ధాపూర్వకముగసాదరముగ నతిధి సేవనము గావించుట ప్రధానాంశమై యున్నది।

2) మంత్రము:- క్షేమ ఇతి వాచి। యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః। కర్మేతి హస్తయోః। గతిరితి పాదయోః। విముక్తిరితి పాయౌ।

ఇతి మానుషీః = సమజ్ఞాః| అథ దైవీః। తృప్తిరితి వృష్టౌ| బలమితి విద్యుతి। యశ ఇతి పశుషు। జ్యోతిరితి నక్షత్రేషు। ప్రజాతి రమృత మానన్ద ఇత్యుపస్థే। సర్వమిత్యాకాశే।

అర్థము :- [సఃపరమాత్మా = ఆ పరమాత్మ] వాచి = వాక్కునందు క్షేమ ఇతి = రక్షించు శక్తి రూపమున నున్నాడు; ప్రాణాపానయోః = ప్రాణాపాన వాయువులందు; యోగక్షేమః ఇతి = ప్రాప్తిమఱియు రక్షణ అనుశక్తి ద్వయరూపమున నున్నాడు; పాదయోః = పాదములయందు; గతిః ఇతి = నడుచుశక్తి రూపమున నున్నాడు; పాయౌ గుదస్థానమునందు; విముక్తిః ఇతి = మలత్యాగ శక్తిరూపముగనున్నాడు; ఇతి = ఈ విధముగనివి; మానుషీః సమాజ్ఞాః = అధ్యాత్మకోపాసనము లై యున్నవి, అథ = పిమ్మట; దైవీః = దైవసంబంధమైనవి; (ఆ పరమాత్మ) వృష్టౌ = వృష్టి యందు; తృప్తిః ఇతి = తృప్తియను శక్తిరూపమునను; విద్యుతి = విద్యుత్తునందు; బలమ్ ఇతి = శక్తి (Power) రూపమునను; పశుషు = పశువులయందు (ప్రాణులయందు) యశః ఇతి = యశస్సు రూపమునను; నక్షత్రేషు = నక్షత్ర గ్రహాదులయందు; జ్యోతిః ఇతి = తేజోరూపమునను ఉన్నాడు; ఉపస్థే = ఉపస్థ యందు; ప్రజాతిః = ప్రజోత్పన్న శక్తి రూపమునను; అమృతమ్ = వీర్యరూప అమృతముగను; ఆనందః = ఆనందము నొసంగు శక్తి రూపముగను ఉన్నాడు; ఇతి = అని; ఆకాశే = ఆకాశమునందు; సర్వమ్ ఇతి = సమస్తమునకు నాధార భూతుడై యున్నాడని యు తెలియనగును.

వ్యాఖ్య :- ఈ దశమానువాక ద్వితీయాంశమున పరమేశ్వర విభూతి సంక్షిప్తముగ వర్ణింపబడినది. సత్యరూపమగు వాక్కునందు ఆశీర్వాదాది శక్తిరూపమునను; ప్రాణాపానములందు జీవనోపయోగ వస్తు

ప్రాప్తి రక్షణముల రూపమునను, చేతులయందు పనిచేయు శక్తి, పాదములందు నడచు శక్తి, గుదము నందు మలవిసర్జన శక్తి రూపమునను పరమాత్మ మన దేహమున నున్నాడు. ఈ శక్తులన్నియు పరమేశ్వర శక్తియే. దీనినిబట్టి మానవునకు పరమేశ్వరునిపై విశ్వాసమేర్పడవలెను. అనగా తాను చేయునది ఏమియులేదు. తనను నిత్యము నడిపించుశక్తియే పరమేశ్వరుడు. అతడు మానవ శరీరాంగములందుండి శక్తిని ప్రసాదించుచు నడపించుచున్నాడు. ఇట్టు మానవ శరీరమున పరమేశ్వర శక్తి యెట్లున్నదో వివరింపబడినది. ఇది ఆధ్యాత్మిక (శరీర సంబంధి) ఉపాసన.

ఈ విధముగనే దైవీ పదార్థములందభివ్యక్తములగు చున్న శక్తి కూడ పరమేశ్వర శక్తియే. ఇయ్యది అధిదైవికోపాసనమగును. సృష్టియందు జలప్రదాన అన్నోత్పాదనాది క్రియా రూపమున ఆనందము నిచ్చుశక్తిని, విద్యుత్తునందు శక్తిని; పశువులందు ప్రభుయొక్క (యజమాని) కీర్తిని పెంపొందించు శక్తిని, నక్షత్రాదులయందు తేజోరూప శక్తిని, ఉపస్థయందు సంతానోత్పాదక శక్తిని, వీర్యరూప అమృత శక్తిని భగవంతుడు కలిగించుచున్నాడు. అ శక్తియే తానైయున్నాడు. వేయేల? ఆకాశమునందు సర్వస్వము తానై యున్నాడు. ఇవన్నియు అపరమేశ్వరుని మూలశక్తిలోని భాగములే. భగవద్గీతయందు "యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జిత మేవవా, తత్తదేవావగచ్ఛత్వం మమతేజోఽంశ సంభవమ్" అని కృష్ణభగవానుడు చెప్పిన విషయ మిదియేకదా!

3) మంత్రము :- తత్ప్రతిష్ఠేత్యుపాసీత। ప్రతిష్ఠావాన్ భవతి తన్మహ ఇత్యుపాసీత। మహాన్ భవతి। తన్మన ఇత్యుపాసీత। మానవాన్ భవతి। తన్నమ ఇత్యుపాసీత। నమ్యన్తేఽస్మై కామాః। తద్బ్రహ్మేత్యుపాసీత। బ్రహ్మవాన్ భవతి। తద్బ్రహ్మణః పరిమర ఇత్యు

పాసీత| పర్యేణం మ్రియన్తే ద్విషన్తః సపత్నాః। పరియేఽప్రియా భ్రాతృవ్యాః।

అర్థము:-తత్ = ఆఉపాస్యదైవమగు పరబ్రహ్మము; ప్రతిష్ఠా = సర్వాధారభూతుఁడు; ఇతి = ఈ ప్రకారముగ; ఉపాసీత = ఉపాసించినచో; ప్రతిష్ఠావాన్భవతి = ఆసాధకుఁడు ప్రతిష్ఠావంతుఁడగును. తత్ = ఆ ఆపరబ్రహ్మము; మహః = అందరికంటె మహాత్ముడు; ఇతి ఉపాసీత = అని తలంచి ఉపాసించినచో, మహాన్ భవతి = ఆ సాధకుడును మహాత్ముఁడగును; తత్ మనః ఇత్యుపాసీత = ఆ పర బ్రహ్మమును మనస్విగనుపాసించినచో; అస్మై = ఈసాధకునకు, కామాః = అఖిల వాంఛలు; నమ్యన్తే = వినతములగుచున్నవి. (నమ్రతతో నమస్కరించుచున్నవగుచున్నవి) తత్ బ్రహ్మ ఇత్యుపాసీత = ఆఉపాస్య దైవమును పరబ్రహ్మముగా భావించి ఉపాసించినచో; బ్రహ్మవాన్ భవతి = బ్రహ్మముతో కూడిన వాడగుచున్నాడు; (బ్రహ్మ విత్ బ్రహ్మైవ భవతి), తత్ = ఆ ఉపాస్యదైవము; బ్రహ్మణః = పరమాత్మయొక్క; పరిమరః = సమస్తమును అంతము చేయు నధికారిగ: ఇత = తెలిసికొని; ఉపాసీత = ఉపాసించినచో; ఏనమ్పరి = అట్టి ఉపాసకుని యెడ; ద్విషన్తః=ద్వేషభావం చూపునట్టి; సపత్నాః = శత్రువులు, మ్రియన్తే =మరణింతురు, యేపరి=అట్టి ఉపాసకునకు అన్నివిధముల, అప్రియాః భ్రాతృవ్యాః = అనిష్టమును, అప్రియమును కోరు బంధుజనులును, మ్రియన్తే = మరణించుచున్నారు.

వ్యాఖ్య:- ఈ మంత్రమున సకామోపాసన యొక్క విభిన్న ప్రయోజనములు వివరింపబడినవి సాధకుడు ప్రతిష్ఠనుకోరి తన ఉపాస్య దైవమును ప్రతిష్ఠారూపమున నుపాసించినచో (భగవంతుని సమస్తమునకు ఆధార భూతుడని భావించి ఉపాసించినచో) ప్రతిభావంతు

సించినచో అతఁడును గొప్పవాఁడగును. మహత్త్వమును పొందును. నమస్కార యోగ్యుఁడగు శక్తిశాలిగ తలఁచి అట్టి శక్తిని ఉపాసించినచో ఆ పరబ్రహ్మమునే తనవశము గావించు కొనఁగల్గుచున్నాఁడు. అతఁడు తన ఉపాస్య దైవమును సర్వ సంహార శాలిగా ఉపాసించి భావించినచో, అతనిని ద్వేషించు జనులెట్టి వారలైనను పరలోకమునకు పోవుదురు. ఈ విధముగ సాధకుఁడు తన ఉపాస్య దైవమగు పరబ్రహ్మమును ఏకరూపునిగ భావించి, ఉపాసించవలె గాని, మానవుఁడు అజ్ఞాన వశమున భిన్న భిన్న శక్తులతో కూడినవారిని (విభిన్న దేవతారూపములను) విభిన్న వాంఛా సిద్ధులకై ఉపాసించుట వాస్తవిక లాభము నుండి వంచితుఁడగుటతప్ప మఱియొకటికాదు. ఇందులకు భగవద్గీత యందలి అక్షర పరబ్రహ్మ యోగము లోని 21 – 24 శ్లోకములును, రాజ విద్యా రాజగుహ్యయోగములోని 22, 23 శ్లోకములును పరిశీలింపఁదగినవి. అందుచేత ప్రతి మానవుఁడు పైరహస్యమునవగాహనము చేసికొని దేవాది దేవుఁడు, సర్వశక్తి స్వరూపుఁడు నగు పరమాత్మను పొందుటకే అతనిని ఉపాసింప వలెనని గ్రహించుట యుక్తము.

4) మంత్రము :- స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః। స య ఏవం విత్। అస్మాల్లోకాత్ ప్రేత్య। ఏత మన్నమయ మాత్మాన ముప సంక్రమ్య। ఏతం ప్రాణమయ మాత్మానముప సంక్రమ్య। ఏతం మనోమయ మాత్మానముప సంక్రమ్య। ఏతం విజ్ఞానమయ మాత్మానముప సంక్రమ్య। ఏతమానన్దమయ మాత్మానముప సంక్రమ్య। ఇమాంల్లోకాన్ కామాన్నీ కామరూప్యను సంచరన్। ఏతత్సామ గాయన్నాస్తే॥

అర్థము:- సః = ఆ పరమాత్మ; యః అయమ్ పురుషేచ = ఈ మానవుని యందున్నట్టివాఁడే; యః అసౌ ఆదిత్యేచ = ఆ సూర్యునియందు

న్నట్టి వాఁడును; సః ఏకః = ఒక్కఁడే అగుచున్నాఁడు; యః ఏవం విత్ = ఏ మానవుఁడీ ప్రకారముగఁ దెలిసికొనగల్గుచున్నాడో; సః అస్మాత్ లోకాత్ ప్రేత్య = అట్టి మానవుఁడిహలోక పరిత్యాగానంతరము; ఏతం అన్నమయ మాత్మానం ఉపసంక్రమ్య=(క్రమముగా) ఈఅన్నమయాత్మనుపొంది; ఏతం మనోమయమాత్మానముప సంక్రమ్య=ఈ మనోమయాత్మను పొంది; ఏతం విజ్ఞానమయమాత్మానముపసంక్రమ్య = ఈ విజ్ఞానమయాత్మను పొంది; ఏతమానంద మయ మాత్మానముప సంక్రమ్య=ఈ ఆనందమయాత్మనుపొంది; కామాన్నీ =ఇచ్ఛానుసారము భోగముల ననుభవించువాఁడై; కామ రూపీ = ఇచ్ఛానుసార రూపధారియై; ఇమాన్ లోకాన్ అనుసంచరన్ = ఈ లోకములన్నిటియందు సంచరించుచు; ఏతత్ సామగాయన్ = తరువాత చెప్పఁబోవు మంత్రమును సామగానము చేయుచు; ఆస్తే = ఉండును.

వ్యాఖ్య:- ఉత్పత్తి స్థితి లయ కారకుఁడు, పరమానంద స్వరూపుఁడు నగు నాపరమాత్మ అందఱియందొక్కఁడే. సర్వ ప్రాణాంతర్గతుఁడై, సర్వాంతర్యామియై, విరాజిల్లుచున్న పరబ్రహ్మ మొక్కఁడే. అతఁడే నానా రూపముల వలన నభివ్యక్తుఁడగుచున్నాఁడు. ఈ తత్త్వమును గ్రహించిన మానవుఁడు వర్తమాన శరీరము నుండి విడివడిన పిమ్మట అన్న ప్రాణ మనో విజ్ఞానానంద మయాత్మల రూపముల నున్న పరమానంద స్వరూపుడగు పరబ్రహ్మమును పొందఁ గల్గుచున్నాఁడు. అనంతరము అశేష విశేష భోగములననుభవించుచున్నాడుఁ. ఇచ్ఛానుసార రూపమును ధరించు శక్తిని కూడ పొందుచున్నాఁడు; అతఁడు సమస్త లోకము లందును సామగానము చేయుచు సంచరించుచున్నాడు.

అహగ్ం శ్లోక కృదహగ్ం శ్లోక కృదహగ్ం శ్లోకకృత్। అహమస్మి ప్రథమజా ఋతా౩స్య। పూర్వదేవేభ్యో౨ మృతస్య నా౩ భాయి యో మా దదాతి స ఇదేవ మా౩ వాః। అహమన్న మన్న మదన్త మా౩ద్మి। అహం విశ్వం భువనమభ్య భవా౩మ్। సువర్న జ్యోతీః। య ఏవం వేద। ఇత్యుపనిషత్।

అర్థము :- హా౩వు హా౩వు హా౩వు = ఆశ్చర్యమాశ్చర్యం: అహమన్నం, అహమన్నం, అహమన్నం = నేను అన్నమును, నేను అన్నమును, నేను అన్నమును; అహం అన్నాదః, అహం అన్నాదః, అహం అన్నాదః, నేను అన్నభోక్తను, నేను అన్నభోక్తను, నేను అన్నభోక్తను; అహంశ్లోకకృత్, అహంశ్లోకకృత్ అహంశ్లోకకృత్ = నేను వీనిని సంయోగము చేయువాడను, నేను వీనిని సంయోగము చేయువాడను, నేను వీనిని సంయోగము చేయువాడను; అహం = నేను ఋతస్య = ప్రత్యక్ష గోచరమగుచున్న సమస్త ప్రపంచమునకు ప్రథమ జాః అస్మి = మొట్టమొదట జనించిన వక్తిని (హిరణ్య గర్భుఁడు) దేవేభ్యః పూర్వం అమృతస్య నాభాయి = దేవతలకంటె పూర్వమే ఉన్న అమృతమునకు నేనే కేంద్రము. యః = ఎవఁడు; మా = నాకు; దదాతి = సర్వము నొసంగుచున్నాఁడో; సః = అతఁడు; ఇత్ + ఏవ = ఈ కార్యము చేతనే; మా అవాః = నన్ను రక్షించు చున్నాఁడు. అహం = నేను; అన్నం = అన్నస్వరూపుఁడనై; అన్నం = అన్నమును; అదన్తమ్ = తినువానిని; అద్మి = మ్రింగివేయుచున్నాను. అహం = నేను; విశ్వం భువనమభ్య భవామ్ = సమస బ్రిహ్మాండ మును తిరస్కరించు చున్నాను; సువఃనజ్యోతీః = స్వాప్రకాశము నందలి ఒక అంశము మాత్రమైనను సూర్యునితోసమానము; యః ఏవం వేద = ఈ విధముగ నెవఁడు తెలిసికొొన గల్గుచున్నాఁడో; (అట్టిసాధకునకు ఈ స్థితి కల్గుచున్నది.) ఇతి ఉపనిషత్ = ఈ విధముగ ఈ

వ్యాఖ్య:- పై మంత్రమున చెప్పఁబడిన సాధకుఁడు సామగానము చేయుచు, పరమాత్మ స్థితిని పొందును. అది అతని అలౌకిక స్థితిని సూచించును. అతఁడట్టి పరమానందముతో "మహాశ్చర్యము! ఈ దృష్టి గోచరమగుచున్న చరాచర జగత్తునందు ప్రథమముగ జన్మించిన వాడను నేనే. (అనగా బ్రహ్మమును నేనే.) పరమానంద స్వరూపుఁడగు పరమాత్మ నాకంటె నభిన్నుఁడే యగుచున్నాడు. ఏ మానవుఁడయిన నన్నేదో ఒక వస్తురూపమున ఎవరికైన ప్రదానము చేసినచో అతఁడు నన్ను రక్షించినవాఁడగును. యోగ్యపాత్రమున భోజన పదార్థములను దానము చేయుటయే వానిని రక్షించు సర్వోత్తమోపాయము కదా! అట్లే మాత్రము దానము చేయకయే తనకు తానే సమస్త భోగములను అనుభవించు భోక్తను నేను అన్నరూపమున మ్రింగి వేయుదును. అనగా నతఁడట్లు వినాశమును పొందును. నేను సమస్త బ్రహ్మాండమును తిరస్కరింపఁ గల శక్తి గలవాఁడను. అట్టి నా మహిమతో పోల్చినచో తక్కినదంతయు తుచ్ఛమే. నా కాంతిలోని ఒక అంశ మాత్రముతో సూర్యుఁడు సమానుఁడు. అనగా ఈ ప్రపంచమునందలి ప్రకాశ సముదాయమంతయు నేనే." అని యీ విధముగ జీవాత్మ పరమాత్మ భావమును పొంది' అహం బ్రహ్మాస్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ అను తత్త్వమును జేరి, జీవాత్మయు పరమాత్మయు నొక్కటే అనుభావము పొందగల్గిన నాడు అతనికి బ్రహ్మత్వ సిద్ధి లభించుచున్నది. మూడు పర్యాయములు ఒకే పదముచ్చరించుట ఉపనిషత్తు పూర్తియైనదని తెల్పుట.

# శాన్తిపాఠము

ఓం శం నో మిత్రః। శం వరుణః।
శం నో భవత్వర్యమా।
శం న ఇన్ద్రో బృహస్పతిః।
శం నో విష్ణు రురుక్రమః।

నమో బ్రహ్మణే। నమస్తే వాయో।
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవాదిషమ్।
ఋతమవాదిషమ్। సత్యమవాదిషమ్।

తన్మామావీత్।
తద్వక్తారమావీత్।
ఆవీన్మామ్। ఆవీద్వక్తారమ్।

ఓం శాన్తిః। శాన్తిః।। శాన్తిః।।।

ఓం తత్స బ్రహ్మార్పణమస్తు।

ఇతి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయోపనిషత్ సమాప్తా